శ్రీమతే రామానుజాయ నమః ు

శ్రీమద్వరవరమునయే నమః



# ఉభయవేదాంతాలలో బ్రహ్మవిద్యలు

('సుబోధకసుధీమణి' ఉ.వే.శ్రీమాన్ కోవెల రంగాచార్య స్వామివారి స్మారకంగా జరిగిన సన్మాన సభలో సమర్పించిన ప్రసంగవ్యాసం)



**పండితరత్న, ఉ.వే.శ్రీమాన్**

**ఈయుణ్ణి అLLగ శింగరాచార్యులు**

సంపాదకుడు:

ఈయుణ్ణి అనంత రంగ రామన్

**2009 జనవరి**



శ్రీమతే రామానుజాయ నమః



# ఉభయవేదాంతాలలో బ్రహ్మవిద్యలు

కోవెలరంగార్యం తం పండితరత్నం నమామి మహనీయమ్ ।
యద్భవ్యకీర్తిమూర్తిః విలసతి విమలా సదా సుధీహృదయే ॥

ద్వాత్రింశద్బ్రహ్మవిద్యానాం వైభవం శ్రుతిగోచరమ్ ।
గురూణాం కృపయా కించిత్ సతా మగ్రే నివేద్యతే ॥

అత్ర యే బహవో దోషా తే సర్వే మత్కృతా ఇతి ।
సౌష్ఠవం సర్వ మాచార్యమూలకం చేతి భావ్యతామ్ ॥

సమస్తభారతీయవిజ్ఞానానికి మూలకందం వేదవాఙ్మయం. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా" అని అన్నట్లు వేదాలు భగవదాజ్ఞారూపాలు. ఇవి ప్రధానంగా రెండు రీతులలో భగవానుని ఆరాధనను తెలుపుతున్నవి. నిత్యనైమిత్తికాలైన పలు వైదికకర్మలను భగవత్ప్రీత్యర్థం, తదాజ్ఞాకైంకర్యరూపంగా అనుష్ఠించడంద్వారా భగవానుని కర్మయోగంతో ఆరాధించడం మొదటిది. సద్విద్య, అంతరాదిత్యవిద్యాది పలువిధాలైన, వేదప్రతిపాదితాలైన బ్రహ్మవిద్యలను తెలిసికొని, వాటిలో తనకు తగిన దానిని ఉపాసించడంద్వారా భగవానుని భక్తిరూపాపన్న జ్ఞానయోగంతో ఆరాధించడం రెండవది. ముఖ్యంగా మొదటి రీతి సంహిత, బ్రాహ్మణాది వాఙ్మయంలో తెలుపబడగా, రెండవవిధానం ఆరణ్యకాలలో, ఉపనిషత్తులలో తెలుపబడ్డాయి. అంటే, భగవానుని సర్వకర్మసమారాధ్యత్వం వేదంలోని పూర్వభాగంలోను, సర్వవిద్యావేద్యత్వం ఉత్తరభాగంలోను తెలుపబడ్డాయి. పలు కామ్యకర్మలను చేయాలని ప్రోత్సహిస్తున్న వేదానికి గల పరమతాత్పర్యం లోకులకు దైవవిశ్వాసాన్ని కల్గించి, క్రమంగా వారిని పారమార్థికచింతను కలవారినిగా చేసి, మోక్షమనే ఉత్తమపురుషార్థాన్ని పొందేటట్లు చేయడమే- అనే సత్యాన్ని శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవపూర్వశతకంలో "అనాద్యామ్నా తత్వాత్ పురుషరచనాదోషరహితం, జనే తాంస్తాన్ కామాన్ విదధపి సాయుజ్య హృదయమ్" అనే సూక్తిద్వారా తెలిపారు. ఈ విధంగా వేదతాత్పర్యప్రకాశకాలుగా, చివరి భాగాలుగా చెప్పదగిన పలు

ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడ్డ భగవదుపాసనారీతులు బ్రహ్మవిద్యలుగా పేరు పొందాయి. ఇవి ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలని 32గా కూడా ప్రసిద్ధిచెందాయి.

ముందుగా బ్రహ్మవిద్య అంటే- ఏమో తెలియాలి కదా ! బ్రహ్మశబ్దంచేత వ్యవహరింపబడే పరమాత్మయొక్క స్వరూపస్వభావాలను తెలిపే విద్య- అంటే- జ్ఞానమని అర్థం. ఇక్కడ విద్య అనేదానికి విధిచోదితమైన భక్తిరూపాపన్నజ్ఞానవిశేషం అని అర్థం. ప్రకృతంలో ఆ జ్ఞానాన్ని బోధించే శబ్దరాశినికూడా అది లక్షణయా తెలుపుతుంది. ఈ విద్యలు రెండు విధాలు. సాక్షాత్తు ముక్తిని పొందించేవి పరవిద్యలు. అంతకంటే వేఱయినవి ప్రతీకోపాసనలు. ఇవి ఉద్గీథే ప్రణవదృష్టి, మనసి బ్రహ్మదృష్టి- మొదలైనవి. శ్రీరామానుజులు ప్రతికోపాసనలను **"ప్రతీకోపాసనం హి నామ అబ్రహ్మణి బ్రహ్మదృష్ట్యానుసంధానమ్"** అని నిర్వచించారు. అద్వైతసిద్ధాంతంలో సగుణవిద్య ముక్తిపర్యవసాయిని అయినా, అది సాక్షాత్తుగా ముక్తిని కల్గించే సాధనం కాదు. ఇక, బ్రహ్మశబ్దానికి **"వేదః తత్త్వం తపో బ్రహ్మ", "బ్రహ్మతత్త్వతపో వేదే"** ఇత్యాదినిఘంటువచనాలవల్ల వేదమనికూడా అర్థం కనుక **"బ్రహ్మణి వేదే ప్రతిపాదితాః విద్యాః"**- వేదంలో ప్రతిపాదితాలైన విద్యలు- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఏతావతా - వేదంలో ప్రతిపాదింపబడినది, పరమాత్మస్వరూప స్వభావాలను తెలియజేసేది, మోక్షపురుషార్థాన్ని పొందించేది అయిన జ్ఞానవిశేషానికి బ్రహ్మవిద్య అని పేరని, దానిని బోధించే అక్షరరాశికికూడా బ్రహ్మవిద్య అనేపేరు లక్షణయా వ్యవహరింపబడుతున్నదని తెలుస్తున్నది. వేదపురుషుడు పలు కథలరూపంలో ఈ విద్యలను తెలుపడంద్వారా వీటిని సదాచార్యముఖంగా అధికరించాలనే సంప్రదాయ రహస్యాన్ని సూచించాడు.

బ్రహ్మవిద్యలన్నీ పరబ్రహ్మప్రాప్తి రూపమైన ఒకే ఫలానికి సాధనాలు అయినా ఉపాస్యగుణాలోని వ్యత్యాసాన్నిబట్టి, విధివాక్యాలలో ప్రయోగింపబడ్డ క్రియాపదాలలోని భేదాన్నిబట్టి ఇవి వేర్వేరుగా బ్రహ్మసూత్రకారునిచేత నిష్కర్షింపబడ్డాయి. ఈ విద్యల సామాన్యమైన స్వరూపాన్ని భగవద్రామానుజులు శ్రీగీతాభాష్యంలో- **"ముముక్షుభిః ప్రాప్యతయా వేదాంతోదితనిరస్తనిఖిలావిద్యాదిదోషగంధ- అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణపరబ్రహ్మపురుషోత్తమప్రాప్త్యుపాయభూత వేదనోపాసనధ్యానాది శబ్దవాచ్య తదైకాంతికాత్యంతికభక్తిమ్"** అని అనుగ్రహించారు.

బ్రహ్మవిద్యలను తెలిసి ఉపాసించడంవల్ల ముక్తి కల్గుతుందనే విషయం. **"స య ఏవంవిత్ అస్మాల్లోకాత్ ప్రేత్య"** అని, **"త మేవం విద్వాన్ అమృత ఇహ భవతి"** అని, **"బ్రహ్మవిదాప్నోతి పరమ్"** అని మొదలైన వేదవాక్యాలవల్ల స్ఫుటమవుతున్నది. బ్రహ్మవిద్యో పాసనలవల్ల పార్యంతికమైన ఫలం మోక్షమైనా, పలు అవాంతర, ఆనుషంగిక ఫలాలు పలు విద్యోపాసనలలో తెలుపబడ్డాయి.



బ్రహ్మవిద్యల స్వరూపాన్ని ఆయా ఉపనిషత్తులు చక్కని ఉపాఖ్యానాల రూపంలో మనకు అందించగా, బ్రహ్మసూత్రకారులు వీటిని ప్రథమాధ్యాయ, తృతీయాధ్యాయాలలోని పలు అధికరణాలలో బహుత్ర ప్రస్తావించారు. ఆయా బ్రహ్మవిద్యలనుగూర్చిన అధికరణాల పేర్లుకూడా ఆయా విద్యల నామాలతోనే వ్యవహరింపబడడంకూడా గమనించదగిన అంశం. ఉదాహరణకు -దహరవిద్యను ప్రస్తావించే అధికరణాన్ని దహరాధికరణమని, భూమవిద్యను తెలిపే అధికరణానికి భూమాధికరణం అని, మధువిద్యను తెలిపే అధికరణానికి మధ్వధికరణమని పేర్లు.

బ్రహ్మవిద్యలు సంఖ్యలో 32 మాత్రమేనా? అంతకంటే ఎక్కువ ఉన్నాయా? అనే విషయాన్ని గమనిస్తే, ప్రస్తుతం మనకు లభించే వేదవాఙ్మయాన్నిబట్టి ఇపుడున్నవి ఒకవిధంగా 32 అని చెప్పవచ్చు తప్ప, బ్రహ్మవిద్యలు 32 మాత్రమే అని సంఖ్యను పరిమితంగా నిర్దిష్టంగా చెప్పే అవకాశం లేదు. విభిన్నశాఖలలో అనే పర్యాయాలు తెలుపబడ్డ అక్షర, దహర, శాండిల్య, వైశ్వానరాది విద్యలకు ఐక్యం గుణోపసంహారపాదంలో తెలుపబడినా, అనంతమహావిభూతులను కలవాడు, అసంఖ్యేయకల్యాణగుణగణ మహార్ణవుడు, అపరిసంఖ్యేయవ్యూహవిభవహార్దాది వివిధదివ్యరూపుడు, పరస్సహస్రనాముడైన పరమపురుషుని ఉపాసనను తెలిపే వేదశాఖలు అన్నీ ఇపుడు పరిగణనదూరాలు. **"అనంతా వై వేదాః"** కదా. అందువల్ల బ్రహ్మవిద్యలు 32 మాత్రమే అని నిర్ధారణగా చెప్పే ప్రమాణం ఏమీ లేదు. ఈ విషయాన్నిగూర్చి ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు ప్రస్తావిస్తూ వేదాంతపుష్పాంజలి అనే గ్రంథంలో - **"ద్వాత్రింశత్ సంతి విద్యాః తవ పదభజనేఽత్రేతి భూయాన్ ప్రవాదః వేదేఽనంతే తదర్థే త్వయి బహుజననేఽనంతకల్యాణపూర్ణే, సంఖ్యానే కః సమర్థః"** అనే అభిప్రాయాన్ని తెలిపారు. ఇక, ఈ 32 బ్రహ్మవిద్యల పరిగణనలోకూడా ఏకాభిప్రాయం లేదు. న్యాసవిద్య, పర్యంకవిద్యాదులను కొందఱు వీటిలో లెక్కించక పోవడం దీనికొక నిదర్శనం.

పురుషులకు బ్రహ్మవిద్యాధికారం ఉన్నట్లే, స్త్రీలకుకూడా ఆ అధికారం ఉన్నదనే విషయం బృహదారణ్యకోపనిషత్తులోని గార్గి చేసే వాదాన్నిబట్టి తెలుస్తున్నది. మైత్రేయీ బ్రాహ్మణంలోకూడా రెండుమార్లు ఈ విషయం నిర్ధారింపబడింది. అందువల్లనే బృహదారణ్యకం చివరలో సర్వోత్కృష్టుడైన పుత్రుని ఉత్పత్తి కోసంవలెనే పండితదుహిత్ర ఉత్పత్తికోసం చేయవలసిన కర్తవ్యం తెలుపబడింది. మానవులకువలెనే దేవతలకుకూడా బ్రహ్మవిద్యాధికారం ఉన్నదని దేవతాధికరణం వచిస్తున్నది.

బ్రహ్మసూత్రాలలోని తృతీయాధ్యాయ- తృతీయపాదంలో ఈ

బ్రహ్మవిద్యలకు సంబంధించిన పలు ముఖ్యమైన అంశాలు విచారింపబడ్డాయి. వైశ్వానరదహరవిద్యాదులు పలు శాఖలలో తెలుపబడ్డాయి. ఒక శాఖలో ఒక విద్య ప్రస్తావింపబడినపుడు దానిలో కొన్ని గుణాలు మాత్రమే తెలుపబడినా, శాఖాంతరంలో అదే విద్య విధింపబడినపుడు అక్కడ తెలుపబడ్డ గుణాంతరాలుకూడా ఆ విద్యోపాసనకు స్వీకరించాలని, ఉపాస్యవస్త్వైక్యాన్నిబట్టి, ఫలైక్యాన్నిబట్టి వాటిని ఒకే విద్యగా లెక్కించాలని సర్వవేదాంత ప్రత్యయాధికరణం బోధిస్తున్నది. (కనుక పలు శాఖలలో చెప్పబడ్డ వైశ్వానరదహరవిద్యాదుల యొక్క ఐక్యాన్ని సాధించడంద్వారా అక్కడక్కడ కొన్ని కొన్ని శాఖలలో చెప్పబడ్డ ఒకే విద్యకు చెందిన గుణాలను అన్నిటినీ ఆ విద్యల ఉపాసనలో స్వీకరించాలి.)

ఉపాస్యవస్తువు అయిన పరమాత్మ ఒక్కడే కనుక అన్ని విద్యలలోను స్వరూప నిరూపకాలైన సత్యత్వ-జ్ఞానత్వ, అనంతత్వ, అమలత్వాలు సంధేయాలు. ఏ బ్రహ్మవిద్యను ఉపాసించేవానికి అయినా అర్చిరాదిగతిలోనే బ్రహ్మప్రాప్తి కల్గుతుందనే విషయం శ్రుతిస్మృతి సిద్ధం అని అనియమాధికరణం తెల్పింది. అదేవిధంగా, హేయప్రత్యనీకత్వం అన్ని విద్యలలోను అనుసంధేయమని అక్షరధ్యధికరణం తెలిపింది. సద్విద్య, ఆనందమయ విద్యాది బ్రహ్మవిద్యలు విషయభేదాన్నిబట్టి పరస్పరం విభిన్నాలు. అని శబ్దాదిభేదాధికరణం తెలియజేయగా, స్వర్గప్రాప్తికి సాధనాలైన దర్శపూర్ణ మాసాదుల సముచ్చయం ఫలభూయస్త్వంకోసం ఒకే పురుషునిలో సంభవించినట్లుగా, ఫలభూయస్త్వంకోసం బ్రహ్మవిద్యల సముచ్చయం సంభవించదని వికల్పాధికరణం ప్రదర్శించింది. ఎందుకంటే- **"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి"** అనే ముండకోపనిషత్ వాక్యంలో చెప్పబడ్డ అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి రూప పుణ్యాపావిధూననం, పరమసామ్యాపత్తి అన్ని బ్రహ్మవిద్యలలోను సమానం. కనుక, ఒక విద్యను ఉపాసించేవానికి వేఱొక బ్రహ్మవిద్యోపాసనయొక్క ఆవశ్యకత మోక్షపురుషార్థసిద్ధికి లేదు.

ఈ విధంగా తృతీయాధ్యాయంలోని తృతీయపాదంలో పలు అధికరణాలలో ప్రతిపాదింపబడ్డ బ్రహ్మవిద్యలకు సంబంధించిన అంశాలను తిరువాయ్‌మొழிలోని **"వీడుమిన్"** అనే దశకం (1-2) లోని 4,5,6,7 పాశురాలలో నమ్మాழ்వార్లు సంగ్రహంగా సూచించారు. ఉదాహరణకు - ధర్మిస్వరూపంవలె స్వరూపనిరూపకాలైన జ్ఞానానందత్వాదులు, హేయప్రతిభటత్వాదులు అన్ని విద్యలలోను అనుసంధేయాలని తృతీయాధ్యాయ- తృతీయపాదంలోని నాల్గవ, పదునాల్గవ అధికరణాలలో చెప్పబడింది. **"ఇల్లతు ముళ్ళదు మల్లదనవనురు ఎల్లెయిల్ అన్నలమ్ పుల్కు పற்றற்றே"** అనే తిరువాయ్‌మొழி (1-2-4)



పాశురం "పరమాత్మస్వరూపం అచిత్తురీతిలో కాని, చిత్తురీతిలో కాని ఉండదు, అతని స్వరూపం అపరిచ్ఛిన్నమైన ఆనందరూపం. దానిని విషయసంగాన్ని విడచి ఆశ్రయించు"- అని తెలుపడం ద్వారా, ఆనందవల్లిలోను, ఆథర్వణికంలో చెప్పబడ్డ ఆనందత్వ, అస్థూలత్వాది ధర్మాలు ఆయా ప్రకరణాలకు సన్నిహితంగా లేని న్యాసవిద్యలోకూడా అనుసంధేయాలని చెప్పడంచేత, స్వరూపనిరూపక ధర్మాలు అన్నీ సర్వవిద్యానుసంధేయాలనే అర్థాన్ని తెలుపుతున్నదని చెప్పవచ్చు. (ఇదే రీతిలో మిగిలిన అంశాలు కూడా మిగిలిన మూడు పాశురాల అర్థాలలో అనుసంధింపబడ్డాయి.)

పందొమ్మిదవది అయిన లింగభూయస్త్వాధికరణం నారాయణానువాకంలో ప్రతిపాద్యుడైన దేవతావిశేషమే ఆయా విద్యలలో చెప్పబడ్డ గుణాలతో కూడినవాడై, సర్వవిద్యావేద్యుడవుతున్నాడు అని నిర్ణయిస్తున్నది. సర్వవిద్యావేద్యుడు శ్రీమన్నారాయణుడైన దేవతావిశేషమనే ఈ అర్థం **"అడఙ్గ ఎழிల్ శమ్బత్తు అడఙ్గక్కణ్డు ఈశన్ అడఙ్గెழிల్ అవదెన్టు అడఙ్గుక ఉళ్ళే"** అనే ఏడవ పాశురంద్వారా నమ్మాழ்వార్లు సూచించారు. "సంపూర్ణంగా ప్రకాశించే విభూతివిస్తృతిని చూచి, అవి అన్నీ భగవానునకు సంపూర్ణంగా చక్కని సంపద అని నమ్మి, నీవుకూడా ఆ ఐశ్వర్యంలో అంతర్భూతుడవై అణగి ఉండు'' అనే ఈ పాశురభావంద్వారా బ్రహ్మరుద్రేంద్రాదిసమస్త విలక్షణపురుషులు భగవద్విభూతిలో అంతర్భవిస్తారని, భగవానుడైన శ్రీమన్నారాణుడే ఆ విభూతిని కల స్వామి అని చెప్పబడింది. ఇక, నారాయణానువాకంలోను, విద్యాంతరాలలోను అధ్యయనం చేయబడే శంభు, శివాదిశబ్దాలు అపర్యవసానవృత్తిద్వారా నారాయణపర్యంతాలు అని, **"స బ్రహ్మ"** ఇత్యాదివాక్యంలో చెప్పబడ్డ అర్థం ఈ పాశురార్థంద్వారా సూచింపబడిందని అనవచ్చు. ఇందువల్ల అన్ని విద్యలలోను నారాయణ రూపదేవతావిశేషమే ఉపాస్యమనే బ్రహ్మసూత్రార్థం ఈ పాశురార్థంద్వారా సూచితం. ఇదే విషయాన్ని పొయ్‌గై ఆழ்వార్లు **"ఒణ్‌తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** - యథార్థజ్ఞానం పద్మావతీనాథుని ఒక్కనిమాత్రమే లక్ష్యంగా కల్గి ఉంటుందని అంటూ సూచించారు కూడా.

ఇక సత్యత్వ, ఆనందత్వాదిగుణవిశిష్టమైన పరమాత్మయొక్క ఉపాసన అన్ని విద్యలలోను సమానమే అయినా, ఒక్కొక్క విద్యలో కొన్ని కొన్ని పరమాత్మ గుణాలు ప్రధానంగా ఉపాసించబడతాయి. కనుక ఆయా గుణవిశేషప్రాధాన్యాన్నిబట్టి విద్యాభేదాన్ని గ్రహించాలి. ఉదాహరణకు దహరవిద్య- శాండిల్య విద్యలకు భేదం లేదు; ఉపాస్యుడైన పరమాత్మ, తత్ప్రాప్తిరూపం అయిన ఫలం- రెండూ సమానమే కనుక ఆ విద్యలు రెండూ ఒకటేనా ? అనే శంక - ఈ రెండు విద్యలలోను

జగదేకకారణత్వ- అపహతపాప్మత్వాది భిన్నభిన్న గుణాలతో కూడుకొన్న పరమాత్మ ఉపాసన విధింపబడడంవల్ల ఇవి భిన్నవిద్యలనే విషయంద్వారా శబ్దాదిభేదాధికరణంలో నిశ్చయింపబడింది. ఈ విధంగా కల్యాణగుణ విశేషప్రాధాన్యాన్నిబట్టి విద్యలలో పరస్పర భేదాన్ని అంగీకరించినపుడు, ఆయా విద్యలలో ఉపాసింపబడే పరమాత్మ భిన్నభిన్న కల్యాణగుణవిశిష్టుడు కనుక, **"తత్క్రతున్యాయా"**ను సారం ఆ విద్యల ఉపాసనవల్ల కలిగే ఆనందంలోకూడా భేదం ఉంటుందా? అనే ప్రశ్న కలుగవచ్చు. అయితే, అటువంటి తేడా ఏమీ ఉండదనే చెప్పాలి. ఎందుకంటే, కొన్ని కొన్ని విద్యల ఉపాసనలలో కొన్ని కల్యాణగుణాలు ప్రధానాలే అయినా, ధర్మిస్వరూప నిరూపకాలైన జ్ఞానానందత్వాదులు అన్ని విద్యల ఉపాసనలలోను అనుసంధేయాలు. కనుక, అన్ని విద్యల ఉపాసనలవల్ల కలిగే ఆనందం సమానమనే చెప్పాలి. లోకంలోకూడా, భిన్నభిన్న రుచులను కల రస్యపదార్థాల ఆస్వాదనవల్ల కలిగే అనుభూతిలో తేడా ఉండదుకదా! అయితే, జీవాత్మలాభంవల్ల పరమాత్మకు కలిగే ఆనందానికి మధ్య పరమాత్మ ప్రాప్తివల్ల జీవునకు కలిగే ఆనందానికి తారతమ్యం ఉంటుందా? అనే ఇంకో సందేహం కలుగవచ్చు. ఈ విషయం చాలా సున్నితమైనది, సూక్ష్మమైనదికూడా. నిజానికి **"నిరంజనః పరమం సామ్య ముపైతి"** అని, **"తమ్మైయొడొక్క అరుళ్ శెయ్‌వర్"** అని ఈ విధంగా ఉభయవేదాలలోను ముక్తుడు పరమాత్మానందంతో సామ్యాన్ని కల ఆనందాన్ని పొందుతాడనే చెప్పబడింది. అయితే, ఇక్కడ ఒక విశేషం మాత్రం ఉన్నది. పరమాత్మ ఆనందం ఆ పరమాత్మకు అధీనం. అంటే స్వాధీనం. జీవుని ఆనందమాత్రం పరమాత్మసంకల్పాధీనం. కొంతమంది జీవులు నిత్యులు, మఱికొంతమంది బద్ధులనే రీతిలోని జీవుల భేదం **"నిత్యం ప్రియా స్తవ హి కేచన తే హి నిత్యాః"** అనే కూరేశుల సూక్తి ప్రకారం పరమాత్మ సంకల్పాధీనం అయినట్లే ఇదికూడా. **"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"** అని వేదం అంటున్నా- పరమాత్మకు ఉండే సృష్టిస్థితిలయకర్తృత్వాదులు జీవునకు లేవని జగద్వ్యాపారవర్జాధికరణంలో తెలుపబడిందికదా! ఈ విధంగా బ్రహ్మవిద్యల ఉపాసనలలో గమనించదగిన సూక్ష్మాంశాలు ఇంకా అనేకం ఉన్నా, వాటిని స్థలాభావంవల్ల ఇక్కడ ప్రస్తావించడం లేదు.

భగవద్రామానుజులు కాని, తదనంతపూర్వాచార్యులు కాని తమ గ్రంథాలలో ఉపనిషద్విద్యల- ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యల వివరాన్ని ఇదమిత్థంగా నిర్దేశించి చెప్పలేదు. అందువల్ల ఈ విద్యల పరిగణనలో పండితులమధ్య సంఖ్యలో 32 అని కొంత ఐకమత్యం ఉన్నా, వాటి వివరంలో మాత్రం అభిప్రాయభేదం కన్పిస్తున్నది. శ్రీమాన్ ఎ. గోవిందాచార్యుల వారు తమ గీతాభాష్య ఆంగ్లానువాదగ్రంథంలో ఉపనిషద్విద్యల పరిగణనలో సత్యబ్రహ్మ విద్యను



వదలిపెట్టి, అక్షివిద్య, భార్గవీ వారుణీ విద్యలను కలిపి లెక్కించారు. కొంతమంది పండితులు 32 బ్రహ్మవిద్యలలో న్యాసవిద్యను చేర్చకుండా దానిని ప్రత్యేకంగా పరిగణించారు. భార్గవీ వారుణీ విద్యను ఆనందమయ విద్యకంటే భిన్నంగా పలువురు గుర్తించలేదు. అదేవిధంగా కొన్ని ప్రాచీన శ్రీభాష్య ముద్రణగ్రంథాలలో అజవిద్య, రుద్రవిద్య, చతుర్ముఖవిద్యలుకూడా ఉపనిషద్విద్యలుగా పేర్కొనబడ్డాయి. ఇటువంటి తేడాలు చాలా కన్పిస్తాయి.

శ్రీమాన్ ఉత్తమూర్ స్వామివారు బృహదారణ్యకోపనిషత్ భాష్యగ్రంథానికి భూమికను వ్రాస్తూ బ్రహ్మవిద్యల పరిగణనలోని పలు వైవిధ్యాలను, వాటి సామంజస్యాలను విపులంగా ఈక్రింది విధంగా చర్చించారు. (పేజీ. 18-27) ప్రసిద్ధాలైన వ్యాహృతి బ్రహ్మవిద్య, త్రిమాత్రప్రణవవిద్యాదులను కొందఱు లెక్కించలేదు. కొందఱి గణనలో పరమపురుషవిద్య లెక్కింపబడినా, దానిని ప్రశ్నోపనిషత్తులో చెప్పబడ్డ త్రిమాత్రప్రణవ విద్యారూపంగా చెప్పబడకుండా, కఠవల్లిలోని **"పురుషాన్న పరం కించిత్"** ఇత్యాదిగా తెలుపబడిన పరమపురుషవిద్యగా చూపబడింది. నాచికేత విద్య, అంగుష్ఠప్రమితవిద్య- అనేవి రెండు భిన్నవిద్యలుగా చూపబడినవి. కాని వాటిని రెండిటినీ కలిపి ఒకే నాచికేతవిద్యగా చెప్పడం యుక్తం. ఉద్గీథప్రస్తావనంలో కన్పించే అంతరాదిత్య విద్య, ఆకాశవిద్య, ప్రాణవిద్యలు బ్రహ్మదృష్టి రూపాలుతప్ప, అవి పరవిద్యలు కావు. నారాయణప్రశ్న, బృహదారణ్యకాలలోని అంతరాదిత్యవిద్య వేరు. జ్యోతిర్విద్య కూడా కుక్షిస్థం అయిన జ్యోతిస్సుకు, దివ్యజ్యోతిస్సును శరీరంగా కల పరమాత్మకు సంబంధించినది అయినా, ఆభిరూప్యాన్ని, కీర్తిని పొందడం అనే ఫలాలను ఉద్దేశించి చేసేది కనుక మోక్షార్థవిద్య కాదు. అదేవిధంగా, ముండకోపనిషత్తు లోని అక్షరవిద్య, బృహదారణ్యకం లోని గార్గ్యక్షరవిద్య- ఈరెండిటినీ వేర్వేరు విద్యలుగా చూపించిన కొందఱి పరిగణనకూడా సరికాదు. **"అక్షరధియామ్"** (3-3-33) అనే సూత్రంలోను, శ్రీభాష్యంలోను, ముండక, బృహదారణ్యక శ్రుతివాక్యాలు కలిపి పఠింపబడ్డాయి. కనుక సర్వవేదాంతప్రత్యయన్యాయంలో వీటిని ఒకటిగా లెక్కపెట్టడమే యుక్తం. యాజ్ఞవల్క్యుడు జనకుని ఉద్దేశించి ఉపదేశించే దహరవిద్యలో నడుమ కన్పించే శ్లోకాన్నిబట్టి కొందరు జ్యోతిషాం జ్యోతిర్విద్యను ఒక ప్రత్యేకవిద్యగా చెప్పడంకూడా యుక్తిసహం కాదు. లేకపోతే, **"ఏవం విదు రమృతా స్తే భవంతి"** అనే పూర్వవాక్యానుసారం ఇంకొక విద్యను కూడా లెక్కించవలసివస్తుంది. అని శ్రీమాన్ ఉత్తమూర్‌స్వామి అభిప్రాయం.

ప్రసిద్ధాలైన దశోపనిషత్తులలోని ప్రధానవిద్యలను ఈక్రింది రీతిలో ముప్పైరెండుగా లెక్కించవచ్చును - అనే విషయాన్ని శ్రీమాన్ ఉత్తమూర్‌స్వామివారు

ఈ క్రింది రీతిలో చూపారు.

1. ఈశావాస్యవిద్య - ఈశావాస్యోపనిషత్తు- (అంతట నివసించే వాసుదేవరూపుడైన, విచిత్రశక్తియుక్తుడైన పరమాత్మయొక్క ఉపాసన)
2. ప్రాణప్రాణవిద్య - కేనోపనిషత్తు- (ఇక్కడ ప్రాణశబ్దం ముఖ్యాముఖ్యసర్వ ప్రాణపరం)
3. నాచికేతవిద్య - కఠోపనిషత్తు (అధ్యాయభేదాన్నిబట్టి విద్యాభేదం అనే రీతిలో విద్యాద్వయం)
4. త్రిమాత్రప్రణవార్థ పరమపురుషవిద్య - ప్రశ్నోపనిషత్తు (ఈ ఉపనిషత్తులోని ఆఱు ప్రశ్నలు - ఈ ఉపాసనకు చెందినవే)
5. భూతయోన్యక్షరవిద్య - ముండకోపనిషత్తు (బృహదారణ్యకంలోని గార్గి బ్రాహ్మణంలోకూడా ఈ విద్య ప్రస్తావింపబడింది)
6. ఆకారాదిపాదయుక్త ప్రణవవిద్య - మాండూక్యోపనిషత్తు
7. మనోమయామృతవిద్య - తైత్తిరీయం శీక్షావల్లి (వ్యాహృత్యుపాసనాంగిక)
8. ఆనందమయవిద్య - తైత్తిరీయ- ఆనందవల్లి (భార్గవీ వారుణీవిద్యకూడా ఇందులోకే చేరుతుంది)
9. దహరవిద్య - ఛాందోగ్యం, బృహదారణ్యకం, తైత్తిరీయంలో నారాయణోపనిషత్
10. ఆదిత్యాంతర్వర్తి హిరణ్మయపురుషవిద్య- తైత్తిరీయ నారాయణం
11. న్యాసవిద్య - తైత్తిరీయనారాయణం. శ్వేతాశ్వతరోపనిషత్తు, కఠవల్లిలోని ద్వయమంత్రం.
12. ప్రజ్ఞానాత్మబ్రహ్మ - ఐతరేయోపనిషత్
13. మధువిద్య - ఛాందోగ్యం - 3
14. గాయత్రీవిద్య - ఛాందోగ్యం - 3
15. శాండిల్యవిద్య - ఛాందోగ్యం - 3 (అగ్నిరహస్య, బృహదారణ్యకగతా)
16. సంవర్గవిద్య - ఛాందోగ్యం - **4** (రైక్వునిచే ఉపదేశింపబడింది)
17. షోడశకలబ్రహ్మవిద్య - (సత్యకామప్రోక్తం) ఛాందోగ్యం - 4
18. ఉపకోసలవిద్య- అగ్నివిద్యాంగిక - ఛాందోగ్యం - **4**
19. పంచాగ్నివిద్య - ఛాందోగ్యం (బృహదారణ్యకంలో కూడా చెప్పబడింది)
20. వైశ్వానరవిద్య - ఛాందోగ్యం - 5



21. సద్విద్య - ఛాందోగ్యం-6-2-1
22. భూమవిద్య - ఛాందోగ్యం -7
23. పురుషవిధాత్మోపాసనమ్ ("అహం బ్రహ్మాస్మి" అని) -బృహదారణ్యకం 3-2)
24. అన్నజనయిత్రిక్షితివిద్య - బృహదారణ్యకం -3-5
25. బాలాకివిద్య - బృహదారణ్యకం - **4**-1
26. మూర్తామూర్తరూప బ్రహ్మవిద్య - బృహదారణ్యకం **4**-3
27. మైత్రేయీవిద్య - బృహదారణ్యకం 4-4, 6-5
28. ఉషస్తకహోలవిద్య - బృహదారణ్యకం - 5-4, 5-5
29. అంతర్యామివిద్య- బృహదారణ్యకం - 5-7
30. సవిరాట్కేంద్రవిద్య - బృహదారణ్యకం - 6-7
31. వ్యాహృతిశరీరకాహర్నామకాదిత్య బ్రహ్మవిద్య- బృహదారణ్యకం - 7-5
32. వ్యాహృతి శరీరకాహంనామకాక్షిబ్రహ్మవిద్య- బృహదారణ్యకం - 7-5

ఈక్రింది ఉపనిషద్విద్యలలో కొన్నిటిలో ఉపాసన స్పష్టంగా విధింపబడనందున అవి మోక్షం కోసం ఉపాసనలు అనే నిర్ణయం కలుగలేదు. కొన్ని అబ్రహ్మణి బ్రహ్మదృష్టిని కల ప్రతీకోపాసనలు, లౌకికపురుషార్థాలను ఆశించి చేసేవి కనుక మోక్షవిద్యలుగా పరిగణింపబడలేదు. వీటిని ఈ క్రిందిరీతిలో లెక్కించవచ్చు.

1. ఉద్గీథంలో అమృతాభయదృష్టి- ఛాందోగ్యం- 1
2. ఉద్గీథంలో ఆదిత్యహిరణ్మయపురుషదృష్టి, అంతరాదిత్యవిద్య- ఛాందోగ్యం- 1
3. ఉద్గీథంలో అక్షిపురుషదృష్టి- అంతరక్షివిద్య - ఛాందోగ్యం- 1
4. ఉద్గీథంలో పరోవరీయస్త్వాదివిశిష్టాకాశ (పరమాత్మ)దృష్టి - ఛాందోగ్యం- 1
5. ప్రస్తావంలో ప్రాణ (పరమాత్మ) దృష్టి- ఛాందోగ్యం- 1
6. ప్రణవకరణకబ్రహ్మోపాసనం - ఛాందోగ్యం- 2
7. దివ్యకౌక్షేయజ్యోతిర్విద్య- (ఇది ఫలాంతరార్థం) ఛాందోగ్యం- 2
8. పురుషవిద్య- (బ్రహ్మవిద్య అయిన పురుషవిద్య చివరలో తెలుపబడింది)

**9.** మనోబ్రహ్మదృష్టి- ఛాందోగ్యం- 2

**10.** ఆకాశబ్రహ్మదృష్టి - ఛాందోగ్యం- 2

**11.** ఆదిత్య బ్రహ్మదృష్టి - ఛాందోగ్యం- 2

**12.** అగ్న్యశ్వమేధాలలో అర్కాది బ్రహ్మదృష్టి - బృహదారణ్యకం - 3-2

**13.** కక్ష్యమధువిద్య (ఇచటి ఉపాసనం స్పష్టంగా తెలుపబడలేదు)- బృహదారణ్యకం- 4-5

**14.** ప్రతిష్ఠాకాష్ఠాభూతౌపనిషదపురుషవిద్య- (దీని ఉపాసనకూడా స్పష్టంగా లేదు) - బృహదారణ్యకం - 5-9

**15.** విద్యుద్బ్రహ్మదృష్టి - బృహదారణ్యకం - 7-7

**16.** విరబ్రహ్మదృష్టి - అన్నప్రాణాల రెండింటి ఉపాసనం - బృహదారణ్యకం - 7-12

**17.** గాయత్రీతురీయపాదపరోరజ ఉపాసనం -బృహ- 7-15

సుబాలోపనిషత్తులోని దహరవిద్య, బృహదారణ్యకంలోని అక్షరవిద్య- దహరవిద్య- శాండిల్యవిద్య- పంచాగ్నివిద్యలు శ్రుత్యంతరాలలో ప్రస్తావింపబడినందువల్ల వాటిని మళ్ళీ ప్రస్తావించలేదు. అదే రీతిలో జ్యోతిర్విద్యకూడా. తైత్తిరీయ, బృహదారణ్యక- ఛాందోగ్యోపనిషత్తులలోనే అధికసంఖ్యలో బ్రహ్మవిద్యలు ఉపదేశింపబడ్డాయి. పైన చూపబడ్డ బ్రహ్మవిద్యల ద్వాత్రింశత్ సంఖ్యాపరిగణనం యథాకథంచిత్ చేయబడినదే. సర్వథా పూర్ణం కాదు. వాస్తవానికి కౌషీతకి బ్రాహ్మణంలోని పర్యంకవిద్య లెక్కింపబడనేలేదు. పరవిద్యలైన పురుషసూక్తవిద్య, ప్రతర్దనవిద్యల ప్రస్తావనే లేదు. దశోపనిషత్తుల ఆధారంగా 32 విద్యల సంఖ్యాగణన చేయబడింది. నిజానికి మిగిలిన ఉపనిషత్తులలోని పరవిద్యల పరిగణనను చేస్తే ఈ సంఖ్య అధికం కావడం తప్పనిసరి.

ఇక శారీరకమీమాంసలో బాదరాయణమహర్షిచేత ఏయే విద్యలు తెలుపబడ్డాయి అనే విషయాన్ని ఆయా అధికరణాలలోని సూత్రాలను గమనిస్తే, ఈక్రింది విధంగా ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలను లెక్కించవచ్చు. క్రమంగా విద్య పేరు ఆ విద్య ప్రస్తావింపబడిన శ్రుతివాక్యం, ఉపనిషత్తు, బ్రహ్మసూత్రం సంఖ్య, అధికరణ పేరు ఈక్రింద చూపబడుతున్నవి. ఈ క్రమం అధికరణాల వరుస సంఖ్యను బట్టి చేయబడింది. పలుమార్లు పలు అధికరణాలలో ప్రస్తావింపబడ్డ విద్యల వివరం కూడా చూపబడింది.



**1.** సద్విద్య - సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయమ్- ఛాందోగ్యం 6-2-1, ఈక్షతేర్నాశబ్దమ్ -1-1-5, ఈక్షత్యధికరణం -1-1-5.

**2.** ఆనందమయవిద్య - తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోఽంతర ఆత్మా ఆనందమయః- తైత్తిరీయం- ఆనంద-5, ఆనందమయోఽభ్యాసాత్ -1-1-13, ఆనందమయాధికరణం-1-1-6.

**3.** అంతరాదిత్యవిద్య- య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే- ఛాందోగ్యం- 1-6-6 "అంతస్తద్ధర్మోపదేశాత్" -1-1-21, అంతరధికరణం-1-1-7.

**4.** అంతరక్షివిద్య (ఉపకోసలవిద్య)- య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే- ఛాందోగ్యం- 4-15-1, 1-7-5, బృహదారణ్యకం - 5-5-2, అంతర ఉపపత్తేః - 1-2-13, అంతరధికరణం-1-1-7.

**5.** ఆకాశవిద్య- అస్య లోకస్య కాగతి రిత్యాకాశః - ఛాందోగ్యం- 1-9-1, ఆకాశోహ వై నామరూపయోః నిర్వహితా- ఛాందోగ్యం- 8-14-1, ఆకాశ స్తల్లింగాత్ - 1-1-23, ఆకాశో ఽర్థాంతరత్వాదివ్యపదేశాత్ - 1-3-42, ఆకాశాధికరణం, 1-1-8, అర్థాంతరత్వాధికరణం

**6.** ప్రాణవిద్య- యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద .... ఛాందోగ్యం - 5-1-1, వాజసనేయకం, అథ హేమా దేవతాః, కౌషీతకి -1-11-5, సర్వభేదాదన్యత్రేమే - 3-3-10, సర్వభేదాధికరణం. కొందరు "ప్రాణ ఇతి మయేతి" - ఛాందోగ్యం- 1-11-5- అన్నది. ఈ విద్యావిషయవాక్యమని భావించారు. కాని, శ్రీభాష్యంలోను, ఉపనిషద్భాష్యంలోను మొదటిదే ఈ విద్యకు విషయవాక్యంగా కన్పిస్తున్నది.

**7.** దివ్యకౌక్షేయజ్యోతిర్విద్య (పరంజ్యోతిర్విద్య)- అథ యదతః పరో దివో జ్యోతిః దీప్యతే- ఛాందోగ్యం 3-13-7,8, జ్యోతి శ్చరణాభిధానాత్ - 1-1-25, జ్యోతిరధికరణం -1-1-10.

**8.** గాయత్రీవిద్య- గాయత్రీ వా ఇదం సర్వం యదిదం కించ - ఛాందోగ్యం - 3-12-1, జ్యోతిశ్చరణాభిధానాత్ 1-1-25, జ్యోతిరధికరణం

**9.** ప్రతర్దనవిద్య- సహోవాచ ప్రాణోఽస్మి. . . .అమృత మిత్యుపాస్స్వ- కౌషీతకి- 3-2, ప్రాణ స్తథానుగమాత్ - 1-1-29, ఇంద్రప్రాణాధికరణం -1-1-11.

**10.** శాండిల్యవిద్య - సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానీతి శాంత ఉపాసీత- ఛాందోగ్యం- 3-14-1, స ఆత్మాన ముపాసీత. మనోమయం ప్రాణశరీరం భారూపమ్ (వాజనేయ - అగ్నిరహస్యమ్), మనోమయోఽయం పురుషోభాః

సత్యస్తస్మిన్ అంతర్హృదయే- బృహదారణ్యకం- 7-6-1, సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్- 1-2-1, సర్వత్ర ప్రసిద్ధ్యధికరణం 1-2-1, సమాన ఏవం చాభేదాత్- 3-3-19, సమానాధికరణం - 3-3-6

11. నాచికేతవిద్య - యః సేతు రీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్ - కఠోప -1-2-3, అత్తా చరాచరగ్రహణాత్ -1-2-12, అత్త్రధికరణం - 1-2-2.

12. ఉపకోసలవిద్య, య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే - ఛాందోగ్యం- 4-15-1, 4-10-15, అంత రుపపత్తేః - 1-2-13, అంతరాధికరణం - 1-2-3.

13. అంతర్యామివిద్య- (ఉద్దాలకవిద్య) - యః పృథివ్యాం తిష్ఠన్ . . . . బృహదారణ్యకం - 5-7-3, 5-7-4, అంతర్యామ్యధిదైవాధిలోకాదిషు తద్ధర్మవ్యపదేశాత్- 1-2-19, అంతర్యామ్యధికరణం - 1-2-4.

14. భూతయోన్యక్షరవిద్య-(అక్షరవిద్య) అథ పరా యయా తదక్షర మధిగమ్యతే- ముండక - 1-1-5,6, అదృశ్యత్వాదిగుణకోక్తేః - 1-2-22, అదృశ్యత్వాదిగుణకాధికరణం -1-2-5, ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్- 1-3-1, ద్యుభ్వాద్యధికరణం-1-3-1.

15. వైశ్వానరవిద్య- ఇమ మాత్మానం వైశ్వానరం.... ఉపాస్తే స సర్వేషు భూతేషు - ఛాందోగ్యం- 5-11-24, 5-8-11, వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్ -1-2-25, వైశ్వానరాధికరణం-1-2-6, భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి- 3-3-55, భూమజ్యాయస్త్వాధికరణం భూతయోన్యక్షరవిద్య - ద్యుభ్వాద్యధికరణం- 3-3-23.

16. భూమవిద్య- యో వై భూమా తత్సుఖం... విజిజ్ఞాపితవ్యమ్- ఛాందోగ్యం- 7-23, భూమా సంప్రసాదధ్యుపదేశాత్- 1-3-7, భూమాధికరణం-1-3-2.

17. త్రిమాత్రప్రణవపురుషవిద్య (పరమపురుషవిద్య)- యః పున రేతం త్రిమాత్రాణైవో మిత్యనేనాక్షరేణ - ప్రశ్నోపనిషత్- 5-5, ఈక్షితకర్మవ్యపదేశాత్సః- 1-3-12, ఈక్షతికర్మాధికరణం-1-3-4.

18. దహరవిద్య- అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరమ్ - ఛాందోగ్యం- 8-1-1, య ఏషోఽంతర్హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే, బృహదారణ్యకం - 6-4-2, దహ్రం విపాప్మం పరవేశ్మభూతమ్- తైత్తి- నారాయణం, దహర ఉత్తరేభ్యః- 1-3-13, దహరాధికరణం - 1-3-5 - కామాదీతరత్ర తత్ర చాఽయతనాదిభ్యః- 3-3-38, కామాద్యధికరణం, (అర్థాంతరత్వాధికరణం



అని కూడా కొందరి అభిప్రాయం)

నాచికేతవిద్య - ప్రమితాధికరణం - 1-3-5.

19. మధువిద్య - అసౌ వా ఆదిత్యో దేవమధు. స య ఏతదేవామృతం వేద- ఛాందోగ్యం- 3-1-1, 3-6-1,3, మధ్వాదిష్వసంభవా దనధికారం జైమినిః- 1-3-30, మధ్వధికరణం - 1-3-8.

20. జ్యోతిషాం జ్యోతిర్విద్య - తం దేవా జ్యోతిషాం జ్యోతి రాయు ర్హోపాసతేఽమృతమ్ - బృహదారణ్యకం- 6-4-16, 17, జ్యోతిషి భావాచ్చ- 1-3-31, మధ్వధికరణం- 1-3-8, న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ -1-4-11, సంఖ్యోపసంగ్రహాధి కరణం-1-4-3.

21. సంవర్గవిద్య- వాయుర్వావ సంవర్గో యదా వా అగ్నిః - ఛాందోగ్యం - 4-3-1,2, 3,4, శుగస్య తదనాదరశ్రవణాత్ తదాశ్రవణాత్ సూచ్యతే హి- 1-3-33, అపశూద్రాధికరణం - 1-3-9.

దహరవిద్య - అర్థాంతరత్వవ్యపదేశాధికరణం-1-3-10.

నాచికేతవిద్య- ఆనుమానికాధికరణం-1-4-1.

22. శ్వేతాశ్వతరవిద్య - అజా మేకామ్.... శ్వేతా-4-5, చమసపదవిశేషాత్- 1-4-8, చమసాధికరణం-1-4-2.

జ్యోతిషాం జ్యోతిర్విద్య -సంఖ్యోపసంగ్రహాధికరణం-1-4-3.

23. అవ్యాకృతబ్రహ్మవిద్య- కారణత్వేన చాకాదిషు యథా వ్యపదిష్టోక్తేః - 1-4-14, కారణత్వాధికరణం-1-4-4.

24. బాలాకివిద్య- యో వై బాలక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ స వై వేదితవ్యః - కౌషీతకి - 4-18, జగద్వాచిత్వాత్ - 1-4-16, జగద్వాచిత్వాధికరణం - 1-4-5.

25. మైత్రేయీవిద్య- ఆత్మా వా అరే ద్రష్టవ్యః..... - బృహ-6-5-6, 4-4-5, వాక్యాన్వయాత్ - 1-4-19, వాక్యాన్వయాధికరణం - 1-4-6,

సద్విద్య-ప్రకృత్యధికరణం-1-4-7.

హిరణ్యగర్భశివాదిపదఘటితవిద్యలు- "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" 1-4-29, సర్వవ్యాఖ్యానాధికరణం-1-4-8.

26. పంచాగ్నివిద్య - తద్య ఇత్థం విదు ర్యే చే మేఽరణ్యే- ఛాందో-5-3-10, యు ఏవ మేతద్విదు ర్యే చామీ అరణ్యే- బృహ-8-2-15,

తదంతరప్రతిపత్తౌరహంతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్- 3-1-1, తదంతరప్రతిపత్త్యధికరణం- 3-1-1, అనియమ స్సర్వేషా మవిరోధశబ్దానుమానాభ్యామ్- 3-3-32 - అని కూడా కొందరి అభిప్రాయం.

27. మూర్తామూర్తరూపబ్రహ్మవిద్య - ఉభయలింగాధికరణం - 3-2-5
ఆనందమయవిద్య- ఆనందాద్యధికరణం -3-3-4
శాండిల్యవిద్య- సమానాధికరణం - 3-3-6
ప్రాణవాసోనుసంధానం- కార్యాఖ్యాధికరణం - 3-3-5

28. వ్యాహృతిశరీరకాదిత్యబ్రహ్మవిద్య- సంబంధాధికరణం - 3-3-7

29. వ్యాహృతిశరీరకాక్షిబ్రహ్మవిద్య- సంబంధాధికరణం - 3-3-7

30. పర్యంకవిద్య- అమితౌజాః పర్యంకః . . . . బ్రహ్మ విద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి- కౌషితకి-1, సాంపరాయాధికరణం - 1-3-12 (ఈవిద్యకు సంబంధించిన స్పష్టమైన బ్రహ్మసూత్రం కన్పించడంలేదు)

31. ఉషస్తకహోలవిద్య- న దృష్టేః ద్రష్టారం పశ్యేః . . . ఏష త ఆత్మా సర్వాంతరః - బృహదారణ్యకం -5-4-2, యోऽశనాయాపిపాసే. . . అతోऽన్యదార్తమ్- బృహదారణ్యకం-5-5-1, అంతరాభూతగ్రామవత్స్వాత్మనోऽన్యథా భేదా దనుపపత్తి రితి చేన్నోపదేశవత్ - 3-3-35, అంతరత్వాధికరణం - 1-3-15
దహరవిద్య- కామాద్యధికరణం -3-3-16
దహరవిద్య- ప్రదానాధికరణం- 3-3-18
వైశ్వానరవిద్య- భూమజ్యాయస్త్వాధికరణం -3-3-23,

32. ఈశావాస్యవిద్య- "హిరణ్మయేన పాత్రేణ....." ఈశావాస్య-15, పూషన్నేకర్షే ..... ఈశావాస్య-16, తత్తు సమన్వయాత్-1-1-4 (అని విషయవాక్యదీపిక)
పురుషార్థాధికరణం -3-4-1 అని ఉత్తమూర్స్వామి అభిప్రాయం
ప్రాణవిద్య- సర్వాన్నానుమత్యాధికరణం -3-4-7,

పైపట్టికను చూస్తే కొన్ని విద్యలు పలు అధికరణాలలో ప్రస్తావింపబడగా, కొన్ని విద్యలు ఒకే అధికరణంలోనే ప్రస్తావింపబడ్డాయని తెలుస్తుంది. ఇందులో దశోపనిషత్తుల లోని విద్యలేకాక సుబాలకౌషీతక్యాది ఉపనిషత్తులలోని దహర, పర్యంకవిద్యాదులుకూడా ఇవ్వబడ్డాయి. ఇక శారీరకమీమాంసలోని అపరవిద్యల ప్రస్తావనను ఈ విధంగా ఉత్తమూర్ స్వామి లెక్కించి, చూపించారు.

1. ఉద్గాతృప్రాణవిద్య- అన్యథాత్వాధికరణం- 3-3-2



2. ఉద్గీథప్రాణవిద్య- అన్యథాత్వాధికరణం- 3-3-2
3. జ్యేష్ఠశ్రేష్ఠప్రాణవిద్య- సర్వాభేదాధికరణం - 3-3-3
4. పురుషవిద్య- పురుషవిద్యాధికరణం - 3-3-9
5. ఉద్గీథవిద్య- తన్నిర్ధారణానియామాధికరణం- 3-3-17
6. ప్రజాపతివిద్య- శరీరే భావాధికరణం- 3-3-21
7. క్రత్వంగాశ్రితోపాసన-అంగావబద్ధాధికరణం- 3-3-22
8. బ్రహ్మదృష్టి- ప్రతీకాధికరణం- 4-1-3
9. ఆదిత్యాదిదృష్టి- ఆదిత్యాదిమత్యధికరణం- 4-1-4

ప్రతినియతస్థానగుణవిశేషాలతో విశిష్టమైన పరమాత్మను విషయంగా చేసికొని ఉపాసించేవిగా గాని, పారమార్థికాలుగా గాని ఏ విద్యలున్నవో అవి పరవిద్యలుగా లెక్కింపబడ్డాయి. "మనో బ్రహ్మేత్యుపాసీత", "ప్రాణం బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాదులు, అబ్రహ్మగోచరాలైన ఉపాసనలు అపరవిద్యలుగా లెక్కింపబడ్డాయి.

పూర్వవికల్పాధికరణంలోని "న సామాన్యాదప్యుపలబ్ధేః" (3-3-49) అనే సూత్రంలో "మృత్యువ న్నహి లోకాపతిః" అని అంటూ దృష్టాంతరూపంగా అగ్నిరహస్యంలోని "స ఏష ఏవ మృత్యు....... ఏతస్మిన్ మండలే పురుషః" ఇత్యాదిగా చూపబడ్డ ఉపాసనం ఎటువంటిది? ముఖ్యార్థమైన ఉపాసనమా ? లేక, అది అన్యార్థమా? అనే విషయం విచారణీయం. పరాధికరణంలోని "పరమతస్సేతూన్మాన ......." (3-2-30) ఇత్యాది సూత్రంలోని ఉన్మానపదంచేత షోడశకలబ్రహ్మవిద్యమాత్రమే గ్రాహ్యమనే విషయం స్పష్టంగా లేదు. పురుషవిద్యాధికరణంలో ప్రస్తావింపబడ్డ రెండు పురుషవిద్యలు పరవిద్యలు కావు. తైత్తిరీయామ్నాతపురుషవిద్యకు బ్రహ్మవిద్యాంగత్వమే తప్ప అది సాక్షాత్ బ్రహ్మవిద్య కాదు. అంటే, అంగిద్వారా బ్రహ్మప్రాప్తి తప్ప సాక్షాత్ బ్రహ్మప్రాప్తి ఈ పురుషవిద్యవల్ల కలుగదు. ఇక, ఛాందోగ్యోపనిషత్తులో ఆమ్నాతమైన పురుషవిద్యకు దీర్ఘాయుఃప్రాప్తి ఫలంగా చెప్పబడినందువల్ల ఇదికూడా బ్రహ్మవిద్య కాదు. పురుషార్థాధికరణంలోని "నావిశేషాత్" (3-4-13), "స్తుతయేऽనుమతిర్వా" (3-4-14) అనే రెండు సూత్రాలు స్వతంత్రకర్మనియమ నిషేధాన్ని తెలుపుతున్నవి అయినా, పరవిద్యావిశేషవిషయాన్ని విచారించేవి కాకపోయినా, విద్యాస్తుతిని అవి వర్ణించడంద్వారా ఈశావాస్యవిద్యను సూచిస్తున్నందున ఆ అధికరణంలో ఈశావాస్యవిద్య ప్రతిపాదింపబడిందని అనవచ్చు. మాండూక్య ఐతరేయోపనిషద్గతాలైన పరవిద్యలు. పైపట్టికలో పరిగణింపబడనందువల్ల,

పైపట్టికకూడా సర్వథా సంపూర్ణమని అనలేము. కేవలం శారీరకశాస్త్రానురోధంగా యథావకాశం పైగణన చేయబడింది. అంతే.

ఇంతవరకు తెలిపిన వివరాలనుబట్టి ఉపనిషత్తులలో శారీరకశాస్త్రంలో గల బ్రహ్మవిద్యల గణనుగూర్చి, అవి 32మాత్రమే అనే సంఖ్యాపరిమితినిగూర్చి పండితులలో ఏకాభిప్రాయం లేదన్నది స్పష్టం. శ్రీఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామి వారుకూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తూ బృహదారణ్యకోపనిషత్తు భూమికలో **"సర్వాసూపనిషత్సు, సర్వత్ర వా శ్రుతౌ ద్వాత్రింశదేవ విద్యా విహితా ఇతి తు నియంత్రయితుం నైవ పారయామః"** అని స్పష్టంగా పలికారు. ఇపుడు కొన్ని బ్రహ్మవిద్యల స్వరూపం యథావకాశం విన్నవించబడుతున్నది. దివ్యసూరుల దివ్యప్రబంధసూక్తులలో కూడా పలు బ్రహ్మవిద్యల ప్రస్తావన ప్రత్యక్షంగా, పరోక్షంగా పలుచోట్ల గోచరిస్తుంది. ఉపనిషత్తుల సారం బ్రహ్మవిద్యలేనని, అవి తిరువాయ్‌మొழிలో చూపబడ్డాయనే ఉద్దేశ్యంతో శ్రీదేశికులు ద్రమిడోపనిషత్ తాత్పర్యరత్నావళి ప్రారంభంలో **"సారః సారస్వతానామ్"** అని ప్రయోగించారని పెద్దల సూక్తి. **"కఱ్ఱుమ్ కల్వినాదన్"** (5-6-2) అనేసూక్తి భగవానుని సర్వవిద్యాప్రవర్తకాన్ని సూచిస్తున్నది. తిరుచ్చన్దవిరుత్త ప్రబంధంలోని **"నీతియాన కేళ్వియార్"** (9) అనే సూక్తి **"ఆత్మా వా అరే"** ఇత్యాదిశ్రుతిలో చెప్పబడ్డ మైత్రేయీవిద్యను, **''శోదియాద శోది నీ''** (34) అనే సూక్తి దివ్యకౌక్షేయజ్యోతిర్విద్యనుసూచిస్తున్నవని ఆచార్యుల అభిప్రాయం. తిరుప్పావైప్రబంధంలో ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యల ప్రస్తావన ఉన్నదని శ్రీశ్రీశ్రీ త్రిదండి పెద్ద శ్రీమన్నారాయణజీయర్ స్వామివారు అభిప్రాయపడ్డారు. 18వ పాశురంలోని **"పఞ్చశయనత్తిన్‌మేల్ ఏఱి"** అనేసూక్తిలో **"నియతపంచాంగమ్"** అని కీర్తింపబడే అయిదు అంగాలను కల న్యాసవిద్య, 23వ పాశురంలో **"తదైక్షత"** అనే శ్రుతిని స్మరింపజేసే **"తీవిழித్తు"** అనే ప్రయోగాన్ని బట్టి, ప్రళయాన్ని సూచించే వర్షాకాల ప్రస్తావననుబట్టి సద్విద్య ప్రస్తావింపబడ్డాయనికూడా కొందరి ఆచార్యుల అభిప్రాయం. పంచమవేదం అయిన మహాభారతానికి సారభూతంగా చెప్పబడే శ్రీవిష్ణుసహస్రనామాలలో పలుచోట్ల ఈ విద్యల ప్రస్తావన ఉన్నదని శ్రీభట్టర్ తమ భాష్యంలో నిరూపించారు. **"మాధవః"** (169) అనే నామం భగవానుడే సర్వవిద్యాప్రవర్తకుడని తెల్పుతున్నది. **"ప్రతర్దనః"** (60) అనే నామం నాచికేతవిద్యను, **"యమః"** (164) అనే నామం ఉద్దాలకవిద్యను సూచిస్తున్నవి. **"మహాస్వనః"** (41) అనే నామం గాయత్రీ విద్యాప్రతిపాదకం. ఇటువంటి పలు అంశాలను భట్టర్‌భాష్యంలో గమనించవచ్చు.

## 1. సద్విద్య



సద్విద్య ఛాందోగ్యోపనిషత్తులోని ఆఱవ అధ్యాయంలో ప్రస్తావింపబడింది. బ్రహ్మసూత్రాలలో ఈక్షత్యధికరణంలో (1-1-5) ఉన్నది. పలు బ్రహ్మవిద్యలను తెలిపే ఉపాఖ్యానంవలెనే ఈ విద్యను తెలిపే కథ కూడా చాలా ఆసక్తికరమైనది.

శ్వేతకేతువు ఉద్దాలకమహర్షి కుమారుడు. అతడు తన పన్నెండవ ఏటనే ఆచార్యసన్నిధిని చేరి, అక్కడ పన్నెండేళ్ళు విద్యాభ్యాసాన్ని చేసి, తండ్రి దగ్గరకు వచ్చాడు. తాను పరిపూర్ణమైన జ్ఞానాన్ని కల్గినవాణ్ణి అయ్యాను- అనే తృప్తితో వెలిగే ముఖంతో వచ్చిన కుమారుణ్ణి చూచి ఉద్దాలకుడు- **"స్తబ్ధోసి, ఉత త మాదేశ మప్రాక్ష్యః యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మత, మవిజ్ఞాతం విజ్ఞాతమ్"** (నాయనా ! అన్నీ బాగా తెలిసినవానివలె కన్పిస్తున్నావు. ఏ పరమాత్మను వింటే, మననం చేస్తే, మనస్సులో దృఢంగా నిలుపుకొంటే అన్నీ విన్నట్లు, మననం చేసినట్లు, మనస్సులో దృఢంగా నిలుపుకొన్నట్లు అవుతుందో, అందఱినీ శాసించే ఆదేశశబ్దవాచ్యుడైన ఆ పరమాత్మను దర్శించావా !'' అని అడిగాడు. అపుడు శ్వేతకేతువు **"కథం ను భగవః ! స ఆదేశో భవతి"** (తండ్రీ ! ఒక్క ఆదేశాన్ని తెలిస్తే అన్నీ తెలిసినట్లు ఏవిధంగా అవుతుందో చెప్పండి.) అని తన తండ్రిని తిరిగి ప్రశ్నించాడు. అపుడు ఉద్దాలకుడు పలు లౌకిక దృష్టాంతాలను ప్రదర్శిస్తూ **"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్"** అనే తత్త్వాన్ని ఈ క్రిందివిధంగా అతనికి వివరించాడు.

**"యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"** (నాయనా ! ఒకే మట్టిపెళ్ళ కుమ్మరివానిద్వారా మట్టిముద్దగా, తర్వాత మూకుడుగా, కుండగా, ప్రమిదగా క్రమంగా మారుతున్నది. కొంతకాలానికి ఆ మూకుడు, కుండ, ప్రమిద - అన్నీ పగిలి చిన్న ముక్కలై, చూర్ణమై మళ్ళీ మట్టిగానే మారుతున్నవి.అంటే, మధ్యలో కుండగా, ప్రమిదగా, మూకుడుగా రూపాలను పొందినవి, ఆయా పేర్లతో వ్యవహరింపబడేవి అన్నీ మన్నుమాత్రమే - అన్నది సత్యం. **"యథా స్యాత్, వాచారంభో వికారో నామధేయం లోహ మిత్యేవ సత్యమ్"** (నాయనా ! బంగారంతో వివిధాలైన ఆకృతులలో చేయబడిన, పలు పేర్లతో వ్యవహరింపబడే ఆభరణాలు అన్నీ బంగారమే అన్నది సత్యం.)

ఈ ఉదాహరణలలో- ప్రారంభంలో ఉండే మన్ను, బంగారం- మొదలైన మూల(కారణ) పదార్థాలు, ఆ తరువాత వివిధాకృతులను పొందిన వాటి కార్యరూపాలు అన్నీ ఒకటే. అవస్థాభేదం మాత్రమే వాటిమధ్య ఉన్నది. పదార్థంలో ఏ తేడా లేదు. ప్రారంభంలోనిది కారణావస్థ అయితే, తరువాతది ఏర్పడినది కార్యావస్థ. కారణాలు అయిన మన్ను మొదలైనవానిని తెలిస్తే, వాటి కార్యాలు

అయిన కుండ మొదలైనవానిని అన్నిటినీ తెలిసినట్లే. కార్యకారణాలు రెండూ భిన్నాలు కావు; ఒకటే అన్నది సత్యం.

ఈ లౌకికోదాహరణలనుబట్టి పరమాత్మతత్త్వాన్ని గ్రహించవచ్చు. **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్"** (నాయనా ! సచ్ఛబ్దవాచ్యమే సృష్టికి ప్రారంభంలో ఉన్నది. అది ఒక్కటే. రెండవది లేదు) అని అంటూ శ్రుతి సచ్ఛబ్దవాచ్యమైన పరబ్రహ్మ మాత్రమే సృష్ట్యాదిలో ఉన్నదని అన్నది. ఆ సత్తు **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ, తత్తేజోऽసృజత"** (పలు విధాలుగా రూపొందాలని సంకల్పించి ఆ సత్తు తేజస్సును సృష్టించింది) అని కూడా చెప్పింది. ఈ విధంగా సంకల్పించడం చేతనలక్షణం. అది అచేతనవిషయంలో సాధ్యం కాదు. కనుక సచ్ఛబ్దవాచ్యం అచేతనం కాదు, చేతనమే. ఆతరువాత శ్రుతిలో "ఆ తేజస్సుకూడా పలు రీతులుగా రూపొందాలని సంకల్పించింది. అది జలాన్ని సృష్టించింది"- అని ఈ రీతిగా తేజస్సు, జలం మొదలైనవి సంకల్పించాయని చెప్పడంలో ఉద్దేశ్యం ఏమంటే - ఆ తేజస్సు, జలం మొదలైనవానిని శరీరంగా కల పరమాత్మ సంకల్పించాడని చెప్పడమే. అందువల్ల జగత్తులోనిది అంతా సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మను ఆత్మగా కల్గి ఉన్నది - అన్నది తత్త్వం. కారణరూపమైన పరబ్రహ్మ కార్యరూపమైన బ్రహ్మకంటే భిన్నం కాదు. కారణావస్థలో నామరూపవిభాగాలను చేయడానికి వీలుకానంత సూక్ష్మంగా ఉన్న పరబ్రహ్మ కార్యదశలో స్థూలావస్థను పొంది నామరూపవిభాగాలను కల్గి స్పష్టంగా ప్రకాశిస్తుంది. అంతే తప్ప ముందులేనిది ఏదీ నూతనంగా పుట్టడం లేదు. ముందున్నదానికి నాశమూ లేదు. కేవలం అవస్థాభేదం మాత్రమే. "Nothing is created nor destroyed" అని విజ్ఞానశాస్త్ర వచనం కూడా. "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అని వేదం చెప్పిన రీతిలో సృష్టికి పూర్వం సూక్ష్మావస్థలో ఉండే సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మ కారణం. సృష్టికి తరువాత స్థూలావస్థను పొందిన పరమాత్మే కార్యం. అదే ప్రపంచం. అందువల్ల సూక్ష్మచిదచిద్విశిష్టమైన బ్రహ్మ కారణంకాగా, స్థూలచిదచిద్విశిష్టమైన బ్రహ్మకార్యం. ఈ రెండు అభిన్నాలు. ఇదే విశిష్టాద్వైతతత్త్వం. పరమవైదికమైన ఈ తత్త్వాన్ని తెలిసి, ఉపాసించేవాడు పరమాత్మను పొందుతాడు- అని సద్విద్య బోధిస్తున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతప్రతితంత్రార్థం అయిన చేతనా చేతనాలకు, పరమాత్మకు మధ్యగల శరీరశరీరి భావాన్ని బోధించే ఈ పరవిద్యలన్నిటిలో శిఖరాయమాణంగా భాసిస్తున్నది.

ఇపుడు, ఈ సద్విద్య ఆழ్వార్ల దివ్యప్రబంధసాహిత్యంలో అనుసంధింపబడ్డ తీరును కొంచెం గమనిద్దాం. సద్విద్య బ్రహ్మసూత్రాలలోని ఈక్షత్యధికరణంలో



**(1-1-6)** ప్రస్తావింపబడినదన్న అంశం పూర్వోక్తమే. ఈ అధికరణంలో - **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్"** అనే ఛాందోగ్యోపనిషద్వాక్యంలో జగత్కారణంగా చెప్పబడ్డ, సచ్ఛబ్దంచేత నిర్దేశింపబడ్డ వస్తువు ప్రధానమే (అచిత్తు- ప్రకృతి) అయి ఉండాలి. ఎందుకంటే, **"ఇదమ్"** అనే శబ్దంచేత నిర్దేశింపబడే, సత్త్వరజస్తమోమయం అయిన జగత్తుకు ఆ త్రిగుణాలతో కూడుకొన్న ప్రధానమే కారణం అవుతుంది తప్ప, త్రిగుణరహితమైన పరబ్రహ్మ కారణం కాదు. అంతేకాక, ఆనుమానికమైన ప్రధానమే ఈ శ్రుతివాక్యంలో సచ్ఛబ్దవాచ్యం, అదే జగత్కారణం- అనే పూర్వపక్షం రాగా, **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి"** అని శ్రుతిలో చెప్పబడ్డ సంకల్పరూపమైన ఈక్షణక్రియ ప్రధానానికి కూడదు. అది సర్వజ్ఞుడుగా చెప్పబడే పరమాత్మకే సాధ్యం. కనుక చిదచిద్విశిష్ట బ్రహ్మమే జగత్కారణం. తనకు శరీరభూతాలైన చిదచిత్తులద్వారా భగవానుడు సత్త్వరజస్తమోగుణాలతో అన్వయాన్ని పరోక్షంగా కల్గి ఉండడం సాధ్యమే. కనుక జగత్సాలక్షణ్యం పరమాత్మకు ఉన్నది. ఇందువల్ల సచ్ఛబ్దవాచ్యమైన కారణం ప్రధానం కాదు, పరమాత్మే- అని ఇత్యాదిగా ఆ పూర్వపక్షం నిరసింపబడింది. కాబట్టి ఈ అధికరణంలో పరమాత్మకు అచిత్తుకంటే ఉండే వ్యావృత్తి తెలుపబడింది. ఇదే సద్విద్యాసారాంశం. ఈ తత్త్వం తిరువాయ్మొழిలోని **"పొఱి యుణర్వు అవై యిలన్" (1-1-2)** అనే ప్రయోగంద్వారా వ్యక్తం చేయబడింది. ఈ సూక్తికి పరమాత్మ ఇంద్రియప్రత్యక్షానికి విషయం అయిన అచిత్తువంటివాడు కాడు- అని భావం. అంటే, అచిత్తుకంటే విలక్షణుడైన పరమాత్మయొక్క స్వరూపాన్ని సాధించే ఈక్షత్యధికరణ-సారాన్ని ఈ సూక్తి ప్రతిపాదిస్తున్నది. ఈ అధికరణసారం సద్విద్యేకదా ! ఈ విద్యావైభవం ఇంకా పలు దివ్యసూరిసూక్తులలో ఉపబృంహితమైనది అనడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి. తిరువాశిరియమ్ ప్రబంధంలోని **"ఇదు పొరుట్కెల్లామ్ అరుమ్ పెఱల్ తని విత్తు ఒరుతానాకి" (4)** అనే ప్రయోగం పరమాత్మనిమిత్తోపాదాన సహకారిరూప త్రివిధకారణ భూతుడని తెలుపడంద్వారా ఈ విద్యను సూచిస్తున్నదని చెప్పవచ్చు. **"తానోరురువే తనివిత్తాయ్" (1-5-5)** అనే తిరువాయ్మొழిసూక్తికూడా సద్విద్యాప్రతిపాదకం అనే విషయం ఈడువ్యాఖ్యలో సుస్పష్టం. సద్విద్యాశ్రుతిలో **"ఏక మేవ", "అద్వితీయ మేవ"** అని అంటూ ఉపాదాన, నిమిత్త కారణాలు చెప్పబడ్డాయని, మూడవకారణం అయిన సహకారికారణం ఈరెండింటివల్ల ఉపలక్షితమని శ్రీభాష్యంలో చెప్పబడింది. **"సదేవ", "ఏకమేవ", "అద్వితీయమ్"**- అనే పదాలు క్రమంగా సహకారి- ఉపాదాన- నిమిత్తకారణాలు చెబుతున్నాయనే నిర్వాహాంతరాన్ని పెరియవాచ్చాన్పిళ్ళై తమ ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో చూపారు. తిరుమழిశైప్పిరాన్

తిరుచ్చన్దవిరుత్తంలో **"ఆదియాదియాది నీ" (3)** అనే సూక్తిలో ఆదిశబ్దాన్ని మూడుమార్లు ప్రయోగిస్తూ కారణత్రయాత్మకుడు భగవానుడని పల్కారు. ఆళ్వార్లుకూడా **"విత్తాయ్", "ఒర్ విత్తాయ్", "ఒర్ తని విత్తాయ్"**- అని అంటూ ఉపాదాన- నిమిత్త -సహకారికారణత్రయాన్ని తెలిపారని పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు. **"మహార్హః" (525)** అనే నామం ఈవిద్యావైభవాన్ని అనుసంధిస్తున్నవి. విష్ణుసహస్రనామాలలోని **"సదక్షరమ్"** అనే నామంలో ఈ విద్యానుసంధానం ఉన్నదని శ్రీపరాశరభట్టర్ భాష్యాన్నిబట్టి చెప్పవచ్చు.

ఇక, ఈ సద్విద్యలో చెప్పబడే సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మ లక్ష్మీవిశిష్టుడనే విశేషంకూడా ఉభయవేదాంతసూక్తిసిద్ధం. సృష్టికి ప్రారంభంలో సచ్ఛబ్దవాచ్యుడొక్కడే ఉన్నాడని పల్కిన వేదమే **"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి"** (కాలం మొదలైన వస్తువులన్నీ విద్యుద్వర్ణాన్ని కల పురుషుని నుండి పుట్టాయి.) అని పల్కింది. సహజంగా నల్లని పురుషునకు ఈవిద్యుద్వర్ణం ఏ విధంగా వచ్చింది? అని అంటే, హిరణ్యవర్ణ అయిన లక్ష్మియొక్క నిత్యసాన్నిధ్యంచేతనే. **"తిరు క్కణ్డేన్ పొన్మేని కణ్డేన్"** అని మహాయోగి అనబడే పేయాళ్వార్లు ఈ అర్థాన్ని పరోక్షంగా తెలిపారు. సృష్టిసమయంలో పరమాత్మ లక్ష్మీవిశిష్టుడనే విషయాన్ని నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్‌మొழி ప్రబంధంలో **"శాలమ్ పడైత్తవనై త్తిరుమార్బనై" (3-7-8)** అనే పదాలను వెంటవెంటనే ప్రయోగించడంద్వారా స్ఫురింపజేశారు. ఇక శ్రుతిలోని **"ఏక మేవ, అద్వితీయమ్"** అనే సూక్తి ఏవిధంగా కుదురుతుంది? అని అంటే, **"స ఏకాకీ న రమేత"** అనే శ్రుతిలో **"ఏకాకీవ న రమేత"** అని అన్వయించినట్లే ఇక్కడకూడా అర్థం చెప్పాలి. సృష్ట్యాదిలోకూడా చిదచిత్తులు నామరూపవిభాగానర్హదశలో ఉన్నాయని చెప్పబడిందే తప్ప పూర్తిగా లేవని అర్థం కాదుకదా! అయితే, కారణావస్థలోని ఈ లక్ష్మీసంబంధం లీలారసమాత్రజనకం కాగా, శేషిత్వావస్థలలోని లక్ష్మీసంబంధం భోగరసమాత్రజనకం- అని పూర్వాచార్యుల సూక్తి.

## 2. ఆనందమయవిద్య

ఉపనిషత్ప్రతిపాదితాలైన బ్రహ్మవిద్యలలో ఆనందమయవిద్య సుప్రసిద్ధం. ఇది కృష్ణయజుర్వేదానికిచెందిన తైత్తిరీయోపనిషత్తులో ఆనందవల్లిలో ప్రస్తావింపబడగా, బ్రహ్మసూత్రాలలో ఆనందమయాధికరణంలో **(1-1-13)** ప్రస్తుతింపబడింది. భగవానుడు సమస్తకల్యాణగుణాలను కలవాడు. ఆనందమయుడు. ఆనందప్రదుడు. అటువంటి పరమాత్మను ఉపాసించినవాడు ఆనందాన్ని పొందుతాడని ఈ విద్య తెలుపుతున్నది. చాలా విద్యలవలె ఈ



విద్యకూడా ఒక చక్కని ఉపాఖ్యానరూపంలోనే సాగింది.

భృగువు వరుణుని కుమారుడు. అతడు ఒకనాడు తండ్రిదగ్గరకు పోయి బ్రహ్మనుగూర్చి బోధించమని ప్రార్థించాడు. **"భృగు ర్వై వారుణిః వరుణం పితర ముపససార, అధీహి భగవో బ్రహ్మేతి"**. అపుడు వరుణుడు **"అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచ మితి. యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి. తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి"**- అన్నం, ప్రాణం, చక్షుస్సు, శ్రోత్రం, వాక్కు, మనస్సు- ఈ విధంగా చాలా ఉన్నాయి. దేనివల్ల ఈ జగత్తు ఉద్భవిస్తున్నదో, ఆ ఉద్భవించిన జగత్తు దేనివల్ల జీవిస్తున్నదో, దేనిలో లయాన్ని పొందుతున్నదో దానిని బ్రహ్మగా గుర్తించు- అని అన్నాడు.

భృగువు పరబ్రహ్మను గుర్తించడంకోసం తపస్సును ప్రారంభిస్తాడు. కొంతకాలానికి సకలజీవాధారం అన్నమే అని, అది బ్రహ్మ అని అతనికి తోస్తుంది. అదే అభిప్రాయాన్ని తండ్రితో చెప్పగా, అన్నం లేకపోయినా ఈ భూతాల మనుగడ జరుగుతున్నది. కాబట్టి ఇంకా తపస్సు చేయమని వరుణుడు అతనితో అన్నాడు. భృగువు మరల తపస్సును కొనసాగించగా ప్రాణమే బ్రహ్మగా తోస్తుంది. అది బ్రహ్మ కాదని తండ్రి మళ్ళీ అనగా తపస్సును మళ్ళీ చేశాడు. మనస్సు బ్రహ్మ అయిఉంటుందని అపుడు తోచింది. కాదంటాడు తండ్రి. "ఇవన్నీ అచేతనాలు, స్వయంప్రకాశకాలు కావు. బ్రహ్మ చేతనమై ఉండాలి. అతడు వీటి అన్నిటికంటే అన్యుడై ఉంటాడు. ఆలోచించు" అని వరుణుడు అనగా భృగువు తపస్సును కొనసాగించి, మఱి కొంతకాలానికి విజ్ఞానస్వరూపుడైన జీవాత్మ బ్రహ్మ అయి ఉంటాడని భావిస్తాడు. అపుడు వరుణుడు - జీవుడు స్వయంప్రకాశాన్ని కలవాడు. చైతన్యాన్ని కలవాడు అయినా, స్వతంత్రుడు కాడు. సృష్టిస్థితి లయాలకు అతడు కారణభూతుడూ కాడు. అందువల్ల అతనికంటే అన్యమైనదే బ్రహ్మ. అది ఏదో గమనించు. ఆలోచించు- అని అన్నాడు.

ఈసారి భృగువు బాగా తపస్సుచేసి, నిరతిశయానందాన్ని స్వరూపంగా కల పరమాత్మే బ్రహ్మ అయి ఉండాలని దృఢనిశ్చయం చేసికొన్నాడు. ఆమాటనే వరుణునితో అన్నాడు. కుమారుని పట్టుదలకు, అతడు యథార్థాన్ని దర్శించినందులకు తండ్రి సంతోషించాడు.

బ్రహ్మ ఆనందస్వరూపుడు, పరమాత్మను ఆవిధంగా తెలిసికొన్నవాడు. ఆయన సన్నిధిని చేరి, అతనితో పాటు సకలభోగాలను అనుభవిస్తాడు- అని ఇచటి సారాంశం. ఈ ఉపాఖ్యానాన్నిబట్టి ఆనందమయుడైన పరమాత్మ సృష్టి స్థితిలయకారకుడు. **"ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నా త్పురుషః"**- ఆ పరమాత్మనుండి

ఆకాశతత్త్వం, దానినుండి వాయుతత్త్వం, ఆ వాయుతత్త్వంవల్ల అగ్నితత్త్వం, దానినుండి జలతత్త్వం, దానినుండి పృథివీతత్త్వం, పృథివినుండి ఓషధులు, వాటినుండి అన్నం, అన్నంనుండి జీవశరీరం పుడుతున్నాయి. ఈ విధంగా పరమాత్మ అన్నిటికీ మూలం. జీవునిలో అన్నమయకోశం, దానిలో ప్రాణమయకోశం, దానిలో మనోమయకోశం, దానిలో విజ్ఞానమయకోశం, అందులో ఆనందమయకోశం ఉంటాయి. ఆ కోశంలో నిరతిశయానందస్వరూపుడైన పరమాత్మ ఉంటాడు. కనుక **"ఆనందో బ్రహ్మ"**- ఆనందమే బ్రహ్మ. ఈ ఆనందంనుండే సకలభూతరాశి పుట్టింది. దానివల్లనే పుట్టిన భూతజాతం జీవిస్తున్నాయి. చివరకు అవి ఆ ఆనందాన్నే చేరుతున్నవి.

సకలజీవరాశికి మూలకారణం అయిన పరమాత్మ **"రసో వై సః"** అన్నట్లు రసస్వరూపుడు. అందువల్ల రసశబ్దవాచ్యుడు. ఈ రసస్వరూపుడైన పరమాత్మను పొంది జీవులు ఆనందాన్ని పొందుతున్నారు. **"రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"** ఇటువంటి రసరూపుడైన, ఆనందస్వరూపుడైన పరమాత్మ లేకపోతే ఎవరిస్థితి గతులూ లేవు. భృగువు పట్టుదలతో తపస్సు చేసి సర్వనియంత, సర్వాంతర్యామి, సకల కల్యాణగుణపూర్ణుడు, నిరతిశయానందస్వరూపుడు, ఆనందప్రదాయకుడు అయిన పరమాత్మను దర్శించగలిగాడు. ఈ విధంగా పరమాత్మను గుర్తించి ఆ రూపంగా ఉపాసించినవారు పరమాత్మ సన్నిధానాన్ని చేరి, బ్రహ్మానందాన్ని ఆ స్వామి అనుగ్రహంవల్ల పొందుతారు- అనేది ఆనందవిద్యాసారాంశం.

ఇంతవరకూ ఉండే భాగాన్ని భార్గవీ వారుణీవిద్యగా గ్రహించి, కొందఱు దీనిని ప్రత్యేకవిద్యగా పరిగణించారు. కాని దీనిని ప్రత్యేకవిద్యగా లెక్కించడం కంటే ఆనందమయవిద్యలో భాగంగా గ్రహించడమే ఉచితం. రెండిటిలోను ప్రమేయమైన విషయం, ఫలం ఒక్కటే కదా !

పరమాత్మ అనుగ్రహంవల్ల లభించే బ్రహ్మానందం అపరిచ్ఛిన్నం. ఇంతటిది అని కొలువడానికి సాధ్యం కానిది. ఈ ఆనందాన్ని కొలవాలని వేదపురుషుడు ప్రయత్నించి, **"యువా స్యాత్ సాధు యువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః. తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్, స ఏకో మానుష ఆనందః"**- యువకుడు, శారీరకంగాను, మానసికంగాను బలవంతుడు, పృథివిని అంతటినీ శాసించగలవాడు పొందే ఆనందాన్ని ఒక ప్రమాణంగా తీసికొని దానినుండి ఒక్కొక్కటి వందరెట్లుగా పెంచుతూ చివరకు మనుష్యానందానికి బ్రహ్మానందం ఒక లక్ష కోటికోట్ల రెట్లు గొప్పది అని భావించి, అయినా తృప్తిచెందక, **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అని ఈనాటికి మాటిమాటికీ లెక్కిస్తూనే ఉన్నాడు. ఏతావతా తేలినది ఏమంటే - మిగిలిన లౌకికాలైన ఆనందాలకంటే



బ్రహ్మానందం ఎంతో గొప్పది- అని. ఇటువంటి ఆనందాన్ని అనుగ్రహించే ఆనందస్వరూపుడైన పరమాత్మను ఉపాసించి తరించమని ఆనందవిద్యాసారం.

ఈ సందర్భంలో అవధేయాంశం ఒకటి ఉన్నది. ఆనందమయవిద్యను ఉపాసించిన ఉపాసకుడు పొందే ఆనందానికి, పరమాత్మ ఆనందానికి మధ్య తారతమ్యం ఏదయినా ఉన్నదా ? లేక, రెండూ అన్నివిధాల సరిసమానమేనా? అని ఆలోచిస్తే, పరమాత్మను ఆనందమయునిగా ఉపాసించినవాడు పొందే ఆనందం పరమాత్మ ఆనందం అంత గొప్పది అనడంలో ఏ సందేహం లేదు. కాని, ఒక్క విషయంలో మాత్రం తేడా ఉన్నది. జీవుని ఆనందం భగవత్సంకల్పాధీనం కాగా, పరమాత్మ ఆనందం స్వాధీనం - అని గుర్తించాలి.

ఈ ఆనందమయవిద్య బ్రహ్మసూత్రాలలో ఆనందమయాధికరణంలో ప్రతిపాదింపబడింది. ఈక్షత్యధికరణసిద్ధాంతానుసారం పరబ్రహ్మం అచిత్తుకంటే వేఱు అని సిద్ధించినా, అది జీవవ్యావృత్తం (జీవునికంటే భిన్నం)కాదు. ఎందువలన అంటే, **"తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యోఽన్తర ఆత్మా నందమయః"** అనే శ్రుతిలో ఆనందమయ శబ్దవాచ్యుడు జీవుడే కనుక, అతడు జీవుడు అయి ఉండాలి. ఎందువల్ల అంటే, **"తస్యైష శారీర ఆత్మా"** అని శారీరపదప్రయోగంద్వారా అతనికి శరీరసంబంధం తెలుపబడడంవల్ల, **"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య"** అనే శ్రుతిలో **"జీవేన ఆత్మనా"** అనే సామానాధికరణ్య ప్రయోగంచేత జీవబ్రహ్మల ఐక్యం చెప్పబడింది. ఇందువల్ల జగత్కారణంగా నిర్దేశింపబడ్డ ఆనందమయుడు జీవుడే- అనే పూర్వపక్షం ఆనందమయాధికరణంలో తల ఎత్తగా, శ్రుతిలో శతగుణితంగా (నూఱు నూఱు రెట్లుగా) అభ్యసించబడే ఆనందం అత్యల్పసుఖాన్ని అనుభవించేవాడు, పరిమిత కర్మవశ్యుడైన జీవునకు ఘటించదు. అది పరమాత్మకే తగును. కనుక పైశ్రుతిలో **"శారీర"** శబ్దానికి జగచ్ఛరీరకుడు - అనే అర్థాన్ని చెప్పాలి. పరమాత్మకు కర్మకృతమైన శరీరం లేదు కనుక, **"అనేన జీవేన"** అనే సామానాధికరణ్యప్రయోగం. శరీరాత్మనిబంధనమైన ఐక్యాన్ని తెలుపుతుందితప్ప, స్వరూపైక్యాన్ని- అంటే జీవపరబ్రహ్మల స్వరూపైక్యాన్ని సాధించదు. కనుక జీవుడు, పరమాత్మ వేఱు వేఱు అని సిద్ధిస్తుంది. కాబట్టి జగత్కారణభూతుడుగా చెప్పబడ్డ ఆనందమయుడు బద్ధ- ముక్తావస్థలోని జీవుడు కానేకాడు, తద్విలక్షణుడైన పరమాత్మయే- అని సిద్ధాంతం చేయబడింది. ఇటువంటి ఆనందమయుడైన పరమాత్మోపాసనను తెలిపేది ఆనందవిద్య. తిరువాయ్‌మొழிలో **"మననక మల మఱ మలర్ మిశై యెழுతరు మననుణర్ వళవు ఇలన్"** (1-1-2) అనే సూక్తి ద్వారా సూచింపబడింది. ఈ సూక్తికి - మనస్సుకు చెందిన అవిద్యాదిదోషాలు

యోగాభ్యాసబలంచేత తీరగా తీరగా, వృద్ధిచెందే మానసజ్ఞానానికి విషయభూతుడైన ఆత్మవంటివాడు కాడు పరమాత్మ- అని భావం. కనుక ఈ సూక్తి శుద్ధి- అశుద్ధి అవస్థలను రెండింటిని కల జీవునికంటే పరమాత్మ విలక్షణుడని తెలిపే ఆనందమయాధికరణ ప్రమేయాన్ని అనుసంధిస్తున్నది. కాబట్టి ఇందులో ఆనందవిద్య సూచింపబడిందని చెప్పవచ్చు. **"ఉణర్ ముఴునలమ్"** (పూర్తిగా జ్ఞానం, ఆనందంగా ఉంటుంది) అని పూర్ణంగా, జ్ఞానత్వాశ్రయంగా, ఆనందత్వాశ్రయంగా పరబ్రహ్మ ఉంటుందని అనడంచేత కారణవస్తువునకు అచేతనమైన ప్రధానంనుండి (అచిత్తును) వ్యావర్తింపజేసే ఈక్షణక్రియాది ధర్మాన్ని, జీవునినుండి వ్యావర్తింపజేసే నిరతిశయానందాభ్యాసాన్ని సూచింపజేయబడింది. **"ఈక్షతేః", "అభ్యాసాత్"** అనే హేతువులు ఈ ద్రావిడసూక్తిలో కూడా సూచింపబడ్డాయి.

### 3. అంతరాదిత్యవిద్య

అంతరాదిత్యవిద్య ఛాందోగ్యోపనిషత్తులో **(1-6-6)** విధింపబడింది. బ్రహ్మసూత్రాలలో అంతరధికరణంలో **(1-1-2)** లో ప్రస్తావింపబడింది. తైత్తిరీయంలోను, బృహదారణ్యకంలోను దీని ప్రస్తావన ఉన్నది.

**"య ఏషోऽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ తస్యోదితి నామ. స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద. తస్య ఋక్ చ సామ చ గేష్ణౌ"**- సూర్యునితో బంగారంలా వెలిగే పరమాత్మ కనబడుతున్నాడు. ఆయన కేశాలు, మీసాలు బంగారంవలె ఆకర్షణీయంగా ఉంటాయి. కేశాదినఖాంతం అంతా చాలా చక్కని వర్ణంతో బంగారంలా మెరుస్తూ ఉంటాడు. అతని నేత్రాలు రెండూ విరిసిన పుండరీకాలవంటివి. ఆ పురుషునకు **"ఉత్"** అని పేరు అన్ని పాపాలనుండి బయటపడినవాడు కనుక **"ఉత్"** అతనికి పేరు. ఋక్కులు, సామలు ఆయనను కీర్తిస్తాయి. పరమాత్మ ఇటువంటివాడని తెలిసికొని ఉపాసిస్తే సర్వపాపాలనుండి ముక్తి లభిస్తుంది. ఇదే అంతరాదిత్యవిద్య. త్రికాలసంధ్యావందనంలో గాయత్రీ మంత్రాన్ని జపించడంద్వారా ఆరాధింపబడే పరమాత్మ ఈ ఆదిత్యమండలాంతర్వర్తియే. పరాశరభట్టర్ **"తేజః పరం తత్ సవితు ర్వరేణ్యం ధామ్నా పరేణాప్రణఖాత్ సువర్ణమ్, త్వాం పుండరీకేక్షణ మామనంతి శ్రీరంగనాథం త ముపాసిషీయ"** అనే శ్లోకంలో ఈ అర్థాన్ని తెలిపారు. ఈనాటికీ ఈ బ్రహ్మ విద్యోపాసన భగవదాజ్ఞా కైంకర్యరూపంగా మిగిలి ఉన్నదని చెప్పడానికి ఇది ఒక సాక్ష్యం.



అంతరాదిత్యవిద్యను బోధించే శ్రుతిలోని **"కప్యాస"** శబ్దాన్ని యాదవప్రకాశులు ''కోతిపిఱ్ఱవంటిది'' అనే అపార్థంతో వివరించినపుడు శ్రీరామానుజులు సహించలేకపోవడమే వారి శ్రీభాష్యరచనకు ప్రోద్బలకం అయింది. ఈ పదాన్ని శ్రీరామానుజులు **"గంభీరాంభఃసముద్భూత- సుమృష్టనాళ- రవికరవికసిత"** అని వివరించడానికి దివ్యసూరిసూక్తులుకూడా దోహదపడ్డాయి. ఉదాహరణకు- **"గంభీరాంభఃసముద్భూత"** అనే అర్థం తిరుమంగై ఆఴ్వార్ల **"నీరార్ కమలమ్బోల్ శెజ్గణ్"** అనే శిఱియ తిరుమడల్ ప్రయోగాన్నిబట్టి స్వీకరించబడింది.

అంతరాదిత్యవిద్యాప్రతిపాదకశ్రుతినిబట్టి పరమాత్మ దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడు, రెండు అందమైన నేత్రాలను కలవాడు- అని అన్నందున అతడు సహస్రాక్ష, త్ర్యక్ష, అష్టనేత్రులకంటే విలక్షణుడని, పుండరీకాక్షుడని అన్నందున అతడు శ్రీమన్నారాయణుడేనని విశేషంగా వ్యక్తమవుతున్నది. అయినా, ఈనాటికీ కొందఱు నవీనపండితులు తమ గ్రంథాలలో **"కప్యాస"** శ్రుతిని వివరించేటపుడు శ్రీరామానుజులు ఆదరించిన అందమైన అర్థాలను గ్రహించకుండా నీచం అయిన మర్కటపృష్ఠమనే అశ్లీలార్థాన్నే చెప్పడం చాలా శోచనీయం.

ద్రావిడబ్రహ్మసంహితలో ఈవిద్య సూచింపబడిన తీరును గమనిస్తే, ఇది తిరువాయ్మొఴిలోని **"ఎదిర్నికఴ్ కఴివినుమ్ ఇననిలన్ మికునరై యిలన్"** అనే సూక్తిద్వారా తెలుపబడింది. బ్రహ్మసూత్రాలలోని అంతరధికరణ ప్రమేయాన్ని గమనిస్తే కేవలజీవుడు జగత్కారణభూతుడు కాకపోయినా, పుణ్యాన్ని ఆర్జించిన ఆదిత్యాదివిశిష్ట చేతనులలో ఎవరో ఒకరు జగత్కారణం కావచ్చు. ఎందుకు అంటే **"య ఏషోऽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః"** అనే ఛాందోగ్యశ్రుతిలో జగత్కారణభూతుడైన పరబ్రహ్మకు కరచరణాదిరూపసంబంధం ఉన్నదని చెప్పబడింది. ఇటువంటి సంబంధం కర్మకృతమైన శరీరం కలవానికేసంభవిస్తుంది. కనుక ఆదిత్యాది జీవులలో ఎవరో ఒకరు జగత్కారణుడై ఉండాలి- అనే పూర్వ పక్షం ప్రసక్తం కాగా, పైన ప్రస్తావింపబడ్డ ఛాందోగ్యశ్రుతివాక్యంలోనే **"సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః"** అని అంటూ జగత్కారణ భూతునకు అపహతపాప్మత్వం పఠింపబడింది. ఇది జీవుని విషయంలో పొసగదు. అంతేకాక, పరమాత్మకుకూడా అప్రాకృతం అయిన దివ్యమంగళరూపం ఉన్నదని శ్రుతులలో, స్మృతులలో ప్రసిద్ధం. కనుక ఈ అంతరాదిత్యశ్రుతిలో ప్రతిపాదింపబడ్డ జగత్కారణభూతుడు పుణ్యవిశేషాన్ని ఆర్జించిన జీవుడు కాడు, అతనికంటే విలక్షణుడైన పరమాత్మయే- అని సిద్ధాంతం చేయబడింది. పైన ప్రస్తావింపబడ్డ తిరువాయ్మొఴి శ్రుతి పరమాత్మకు కాలత్రయంలో సాటి అయిన వారెవ్వరు లేరని, మించినవారెవ్వరు లేరని అన్నందున అతడు నిస్సమాభ్యధికుడని చెప్పబడింది.

అంతరాదిత్యవిద్యలోకూడా అపహతపాప్మత్వ - పుండరీకాక్షత్వాదిధర్మాల వల్ల నిస్సమాభ్యధికుడైన, ఆదిత్య మండలాంతర్వర్తి అయిన పురుషుడు విలక్షణజీవుడు కాడు, పరమాత్మే- అని సిద్ధాంతం చేయబడినందున ఈ ద్రావిడసూక్తి అంతరాదిత్యవిద్యా ప్రతిపాదకం అని చెప్పవచ్చునని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ అంతరాదిత్యవిద్య బృహదారణ్యకం (7-5-1)లోకూడా తెలుపబడింది. విష్ణుసహస్రనామాలలోని **"ఆదిత్యః"** అనే నామంలోను, **"శెయ్యదోర్ ఞాయిఱ్ఱై కాట్టి చ్చిరీదరన్మూర్త్తి ఈదెన్నుమ్", (4-4-2) "శెజ్జుడర్ తామరైక్కణ్ శెల్వనుమ్" (5-4-9)** అనే తిరువాయ్‌మొழி సూక్తులలోను అనుసంధింపబడింది. ఆదిత్యాంతర్వర్తి అయిన పరమాత్మ లక్ష్మీవిశిష్టుడనే విషయాన్ని ఈ నమ్మాழ்వార్ల సూక్తులు సూచిస్తున్నవికూడా. ఈ విషయంగూర్చిన ఇంకా పలు వక్తవ్యాంశాలు విస్తృతిభీతిచే విడువబడ్డాయి.

కంటిలో చూడబడే పురుషుడే అమృతం, అభయం, బ్రహ్మమును. అతనిలో అన్ని కల్యాణగుణాలు పూర్ణంగా ఉన్నాయి. అతడు తనను ఆశ్రయించినవారికి మంచి బుద్ధిని ఇస్తాడు. అతడే అన్నిలోకాలలో నిండిన ప్రకాశం కలవాడు. ఈ విధంగా ఉపాసించేవాడు అర్చిరాదిమార్గంలో పయనించి పరమాత్మను చేరతాడు- అన్నది ఉపకోసలవిద్యాసారం. ఈ సూర్యమండలంలో ఉండే పురుషుడు, కుడికంటిలో ఉండే పురుషుడు- వీరిద్దరు ఒకరికొకరు ఉపకారకులు. సూర్యమండలంలోని పురుషునకు "అహః" అని, నేత్రవర్తికి **"అహమ్"** అని పేరు. ఇది తెలిసి ఉపాసనచేసేవారు పాపవినిర్ముక్తులవుతారు- అన్నది అక్షిస్థపురుషాహంనామకవిద్య, ఆదిత్యమండల స్థాహర్నామక విద్యల సారం. ఈ అక్షివిద్యలను, అంతరాదిత్యవిద్యను కలిపి ఒకటిగా లెక్కించవచ్చునని మరికొందరి అభిప్రాయం. Thus Akshi and Antaraditya vidyas may be combind as one - అని నారాయణ అయ్యర్‌గారి అభిప్రాయం. కాని, శ్రీరామానుజులు **"బ్రహ్మణః ఏకత్వేఽపి ఏకత్రాదిత్యమండలస్థతయా ఉపాస్యత్వమ్, ఇతరత్ర అక్ష్యాధారతయోపాస్యత్వమితి స్థానసంబంధత్వభేదేన రూపభేదాత్ విద్యాభేదః"** - అని స్థానభేదాన్నిబట్టి విద్యారూపాలలో భేదాన్ని తెల్పి, వేర్వేరు అని సిద్ధాంతం చేశారు.

### **4.** దహరవిద్య

బ్రహ్మసూత్రాలలో ప్రథమాధ్యాయం -తృతీయపాదంలో దహరాధికరణం, (అర్థాంతరత్వవ్యపదేశాధికరణం, కామాద్యధికరణం, ప్రదానాధికరణం) ఈవిద్య ప్రస్తావించింది. దీనికి మూలంగా ఛాందోగ్యోపనిషత్తులోని **"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశః తస్మిన్**



**యదంతః తదన్వేష్టవ్యమ్ తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" (8-1-1)**అను మొదలైన వాక్యాలలోని అర్థాన్ని భావించాలి- "ఈ శరీరం బ్రహ్మపురం. అంటే- బ్రహ్మకు నివాసస్థానం. ఇందులో తామరపూవువంటి అత్యంత సూక్ష్మం అయిన హృదయం ఉన్నది. అందులో ఉన్న దహరాకాశాన్ని తదంతర్వర్తి పరమాత్మను, పరమాత్మస్థానాన్ని అన్వేషించాలి. ఉపాసించాలి'' అని పై శ్రుతివాక్యభావం. బ్రహ్మసూత్రాలలోని **3-3-38**వ సూత్రంలో కూడా ఈ విద్యాప్రస్తావన ఉన్నది.

ఈ లోకంలోని ఆకాశంలో ఉండే ద్యావాపృథువులు, అగ్నివాయువులు, సూర్యచంద్రులు, విద్యున్నక్షత్రాలు- అన్నీ దహరాకాశంలో ఉన్నాయి. ఇచటి ద్యావాపృథువు లంటే భోగ్య- భోగస్థాన- భోగోపకరణాలు. అగ్నిసూర్యాదులు అంటే భోక్తృవర్గం. ఈలోకంలో ఉన్నవే కాక, ఇక్కడ లేనివి, కేవలం భావించడానికి సాధ్యమై, అనుభవానికి అందనిదికూడా ఈ దహరాకాశంలో ఉన్నాయి. **"యచ్చాస్యేహాస్తి, యచ్చ నాస్తి సర్వం తస్మిన్ సమాహిత మితి".**

దేహానికి ముసలితనం కలిగినా అందులోని బ్రహ్మపురం జీర్ణం కాదు. అది నిర్వికారం. అందులో అన్ని కల్యాణగుణాలున్నాయి. దానికి పాపస్పర్శ లేదు. వార్ధకం, మృత్యువు, ఆకలి, దప్పికలవంటి హేయగుణాలు లేవు. ఈలోకంలో ప్రభువు శాసనానుసారంగా తత్పరతంత్రులై భోగాలను పొందేటట్లే, దహరాకాశంలోకూడా పరమాత్మకు పరతంత్రులై ఆయా భోగాలను పొందుతారు. అన్ని పుణ్యాపాపాలు నశిస్తాయి.

శరీరాన్ని పురంగా, ఇంద్రియాలను పౌరులుగా, పరమాత్మను సార్వభౌముడుగా, తనను భృత్యునిగా భావించాలని పెద్దల సుద్ది. ఈ రీతిలో జీవునకు సన్నిహితంగా ఉండే పరమాత్మను, కల్యాణగుణాలతోపాటు అతనిని ఉపాసించడాన్నిగూర్చి ఈ దహరవిద్య ఉపదేశిస్తున్నది. పరమాత్మరూపాన్ని, కల్యాణగుణాలను, ఆయన స్థానాన్ని తెలిసి ఉపాసించినవాడు సత్యకాముడు, సత్యసంకల్పుడూ కాగలడు. అతడు కోరినవి అన్నీ సంకల్పంవల్లనే సిద్ధిస్తాయి. పితృలోకం, మాతృలోకం - అన్నీ అతని సంకల్పంచేత లభిస్తాయి. **"యం కామం కామయతే సోఽస్య సంకల్పాదేవ సముత్తిష్ఠతి."**

ఈ దహరవిద్య విష్ణుసహస్రనామాలలోని **"పద్మగర్భః"** అనే నామంలో ప్రస్తావింపబడిందని ఆ నామభాష్యాన్నిబట్టి గుర్తించవచ్చు. ఇక, తిరువాయ్‌మొழிలోని **"అడిచ్చోతి నీ నిన్ఱ తామరైయాయ్ అలర్న్దదువో"** (పాదాల కాంతి నీవు నిలచిన తామరపూవుగా వికసించిందా ?) (3-1-1) **"తణ్డామరై శుమక్కుమ్ పాదప్పెరుమానై"** (చల్లని తామరపూవు మోసే పాదాలను కల స్వామి)

**(4-5-8)** అనే సూక్తులలోని తామరను హృదయపుండరీకంగా గ్రహించే పక్షంలో ఇవి ఈ దహరవిద్యను సూచిస్తున్నవని అనవచ్చు.

ఉభయవేదాంతైకకంఠ్యాన్నిగూర్చి తెలుపుతూ పూర్వాచార్యులు **"ఇఱైయవర్ అవరవర్ విధివ ழி యడైయ నిన్ఱనర్" (1-1-5)** అనే తిరువాయ్‌మొழிసూక్తి దహరాధికరణ ప్రమేయసంగ్రహమని అన్నారు. ఏ విధంగా అంటే- **"యావాన్ వా అయ మాకాశః", "ఉభే అస్మిన్ ద్యావా పృథివీ", "ఉభా వగ్ని శ్చ వాయు శ్చ సూర్యాచంద్రమసా వుభౌ విద్యున్నక్షత్రాణి"** అనే ఛాందోగ్యవాక్యంలో దహరాకాశాన్ని **"అస్మిన్"** అని అంటూ నిర్దేశించి, అది అగ్ని, వాయు, సూర్య, చంద్ర, విద్యుత్, నక్షత్రాలకు ఆధారంగా ఉన్నదని పల్కి, **"యచ్చేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్ సమాహితమ్"** అని అంటూ పూర్వవాక్యంలో అగ్న్యాదులకు అన్నిటికీ ఆధారంగా చెప్పబడ్డ దహరాకాశాన్ని **"అస్మిన్"** పరామర్శించి, ఆ బ్రహ్మోపాసనను చేసేవారికి ఈ లోకంలో లభ్యమయేవి, పరలోకంలో లభ్యమయేవి, మనోరథాలకు మాత్రమే గోచరించేవి అయిన సమస్తభోగ్యజాతం ఈ దహరాకాశంలో ఉన్నదని చెప్పబడింది. ఈ రెండు వాక్యాలలోను పూర్వవాక్యంలో చెప్పబడ్డ అగ్ని, వాయువు మొదలైన అన్నిటికీ ఆధారరూపమైన సర్వశరీరకత్వాన్ని ఆழ்వార్లు **"ఇఱైయవర్ అవరవర్ విది వழி యడైయ నిన్ఱనర్"** (నిరుపాధికుడైన సర్వేశ్వరుడు ఆశ్రయించేవారు విధి ప్రకారంలో ఆశ్రయించేటట్లు, ఆశ్రయణీయులు వారికి ఫలాన్ని ఇచ్చే శక్తిని కలవారు అయేటట్లు వారి అందఱిలో అంతరాత్మగా ఉన్నాడు.) అని అనడంద్వారా తెలిపారు. కనుక ఛాందోగ్యంలో తదవ్యవహితద్వితీయవాక్యంలో చెప్పబడ్డ సర్వాధారుడైన పరమాత్మకు ప్రతిపాదింపబడ్డ నిరతిశయభోగ్యగుణత్వం ఈ ఆழ்వార్ల సూక్తిచేత సూచితం- అని చెప్పవచ్చు.

## 5. ఈశావాస్యవిద్య

సమస్తజగత్తులోను భగవానుడు వ్యాపించి ఉన్నాడు- అనే సత్యాన్ని గ్రహించి, చరాచరాలను అన్నిటినీ పరమాత్మ ప్రకారాలుగా భావించి, ఆ పరమాత్మను ఉపాసించిన వానికి సకలపుణ్యాపాపనివృత్తి, అమృతత్వప్రాప్తి కల్గుతుందని ఈశావాస్యోపనిషత్తులో ఉపదేశింపబడగా బ్రహ్మసూత్రాలలో ఇది పురుషార్థాధికరణంలో ప్రస్తావింపబడింది అని ఉత్తమూర్‌స్వామి అభిప్రాయం. సమన్వయాధికరణంలో ఈ విద్యాప్రస్తావన ఉన్నదని విషయవాక్యదీపికా గ్రంథాన్నిబట్టి చెప్పవచ్చునని శ్రీనివాసరాఘవన్‌గారి అభిప్రాయం.

**"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్, తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యచిద్ధనమ్" (7-23)** - ఈ జగత్తు సర్వం, ఇందులో ఉండేది ఏదైనా ఈశావాస్యం. పరమాత్మచేత వ్యాప్తం. నీకు ప్రాప్తించిన వాటిని సంగరహితంగా అనుభవించు. భగవద్విహిత కర్మాచరణకు దేహం ఆవశ్యకం కనుక దేహధారణకు ఎంతవరకు అవసరమో తావన్మాత్రమే అనుభవించు. అందులోను పరద్రవ్యాన్ని ఏనాడూ కోరకు.

**"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః"** - ఈ దేహం భగవదారాధన కోసమే నీకు అనుగ్రహింపబడింది. అది నిలచి ఉన్నన్నాళ్ళు విహితకర్మానుష్ఠానం చేస్తూ తద్ద్వారా పరమాత్మను ఉపాసించాలి. కర్మానుష్ఠానానికి - బ్రహ్మోపాసనకు మధ్య గల ఈ అవినాభావసంబంధాన్ని గ్రహించి అవిద్య అనబడే విహితకర్మను చేయడంద్వారా విద్య అనబడే బ్రహ్మోపాసనను చేసి అమృతత్వాన్ని పొందాలి. ఈ కర్మానుష్ఠానాన్ని **"భగవద్వ్యాప్తం ఈచరాచరమంతా"** అనే భావనతో చేసినపుడు భగవానునకు తాను శేషభూతుడు, ఆ పరమాత్మ సర్వశేషి, అతడే ప్రాప్యుడు తత్ప్రాప్తిప్రతిబంధకం అయిన శరీరాన్ని, తన్మూలమైన ప్రాక్తనకర్మలను విహితకర్మానుష్ఠానద్వారా పోగొట్టుకోవాలనే ఉపాసకుని సంకల్పం ఫలేగ్రహి అవుతుంది.

ఇక, ఈ విద్యాప్రసక్తి తిరువాయ్‌మొழிలోని **"వీడుమిన్"** దశకంలో **(1-2)** లోని ఎనిమిదవ పాశురంలో గల **"ఇఱైయుళ్ళి లొడుఙ్గే"** అనే సూక్తిద్వారా సూచింపబడిందని పూర్వాచార్యనిర్వాహం. ఈశావాస్యవిద్య ప్రస్తుతింపబడ్డ పురుషార్థాధికరణంలో విద్యయే మోక్షసాధనం అన్నది ప్రధానమైన అంశం. పరమాత్మ విషయంలో న్యస్తభరుడై ఉండాలని అనడంద్వారా సిద్ధోపాయ స్వీకారరూపం అయిన జ్ఞానవిశేషమే రక్షకం అని తెలిపే పై ఆழ்వార్లసూక్తి ఈ అంశాన్ని సూచిస్తున్నందున అది ఈశావాస్యవిద్యను తెలుపుతున్నదని చెప్పవచ్చు. **"వకుత్త విషయత్తిలే ఇవற்றை యుజ్కొణ్డు పుక్కు అడిమై శెయ్యప్పార్"** (ప్రాప్తవిషయంలో ఈ కరణాలను ఉపయోగించి కైంకర్యం చేయాలని చూడు) అని ఈ సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్ళై వివరించారుకూడా. ఈశావాస్యవిద్యాసారం ఇదే కదా !

## 6. భూమవిద్య

భూమవిద్యను సనత్కుమారుడు నారదునకు ఉపదేశించాడు. ఇది ఛాందోగ్యోప నిషత్తులోనిది. **(1-3-7)** బ్రహ్మసూత్రాలలో ప్రథమాధ్యాయం తృతీయపాదంలో ఇది ప్రస్తుతింపబడింది.

సకలవేదాలు, శాస్త్రాలు, పురాణాలు- అన్నిటినీ అధ్యయనం చేసినా నారదునకు

తృప్తి కలగలేదు. తనకు తెలియని ఏదో ఇంకా ఉందని తోచి అది ఏమో తెలియక బాధపడ్డాడు. తనకు అన్న అయిన సనత్కుమారుని దగ్గరకు వచ్చి **"అధీహి భగవ ఇతి హోపససాద సనత్కుమారం నారదః"** అని అంటూ తొందరలో నాకు తెలియజేయమని అంటాడే తప్ప, దేనినిగూర్చి చెప్పాలోకూడా తెలుపలేదు. అపుడు సనత్కుమారుడు "నీకు తెలిసినది ఏమో చెప్పు''- అని అన్నాడు. నారదుడు తాను అధికరించిన విద్యల వివరాలను అన్నిటిని తెలిపి, "ఎన్నో విద్యలను నేర్చినా వాటి ఆంతర్యం నాకు అంతు పట్టలేదు. ఆత్మజ్ఞానం కలిగితే తప్ప శోకం తీరి ఆనందం కల్గదని విన్నాను. ఆ ఆత్మజ్ఞానం లేనందుచేత నేను శోకాన్ని పొందుతున్నాను. నా శోకాన్ని తీర్చి ఆత్మజ్ఞానాన్ని కల్గించు''అని అడిగాడు.

నారదుడు అంతవరకు చదివిన చదువులన్నీ బ్రహ్మజ్ఞానానికి సోపానాలవంటివి అని, వాటి సాయంతో మరింత ముందుకు పోయి చివరి సోపానాన్ని చేరినపుడు బ్రహ్మజ్ఞానం కల్గుతుందని అంటూ- ఋగాదివేదాలు నామరూపమయాలు. ప్రపంచం నామరూపమయం. వేదాధ్యయనంవల్ల నామ బ్రహ్మ తెలియవచ్చు. దానిని ఉపాసిస్తే దానికి సంబంధించిన తెలివి కల్గి, ఉపాసకుడు దానిలో యథేష్టంగా సంచరించి ఆనందించగలడు -అని సనత్కుమారుడు అంటాడు. ఈనామంకంటే గొప్పది ఏమైనా ఉన్నదా ? అని నారదుడు అడిగిన ప్రశ్నకు వాక్కు గొప్పది అని సనత్కుమారుడు బదులిస్తాడు. ఈ రీతిలో నారదుడు మాటిమాటికీ అడిగిన ప్రశ్నలకు సనత్కుమారుడు మనస్సు, సంకల్పం, చిత్తం, ధ్యానం, విజ్ఞానం, బలం, అన్నం, జలం, తేజస్సు, ఆకాశం, స్మరణం, ఆశ- అని పధ్నాలుగు ఉపాసనలను పేర్కొని, అవి ఒకదానికంటె వేఱొకటి గొప్పవి అని అంటాడు. చివరగా నారదుడు అడిగినపుడు సనత్కుమారుడు పరబ్రహ్మమే గొప్పది. ఆ పరబ్రహ్మ అనంతైశ్వరసంపన్నుడు. **"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శ్రుణోతి నాన్యద్విజానాతి భూమా''** అని అంటాడు. ఇటువంటి పరబ్రహ్మను అనుభవించేటపుడు ఉపాసకుడు వేఱు దేన్నీ చూడడు, వినడం, తెలియడు. ప్రపంచాన్ని అంతటినీ బ్రహ్మాత్మకంగా భావించి అనుభవిస్తే కలిగే ఆనందం అనల్పం. బ్రహ్మాత్మక జగత్తును అబ్రహ్మాత్మకం అని తలచినపుడు, అది అల్పం, మర్త్యం. ఇటువంటి భూమశబ్దవాచ్యుడైన పరమాత్మ తన మహిమపైనే ఆధారపడి ఉన్నాడు. దీనికి ఏదీ ఆధారం కాదు. **"స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"** అని ఉపదేశించాడు. ఈ విధంగా సనత్కుమారుడు నామంనుండి ఆత్మవరకు ఉండే సోపానాల వరుసను తెల్పి, ఆత్మకు పిమ్మట భూమను ఉపదేశించడంవల్ల జీవునికంటే గొప్పవాడు భూమశబ్దవాచ్యుడైన పరమాత్మ అని, అతడే అమృతం, సుఖం, అనల్పం అని తెలుస్తున్నది. ఇటువంటి భూమను ఉపాసించే విద్యే భూమవిద్య. ఇక్కడ



అవధేయాంశం ఒక్కటి ఉన్నది. పరబ్రహ్మదర్శన శ్రవణాదులను చేసేవానికి తద్వ్యతిరిక్తమైన ప్రపంచం అనుభవంలోకి రాదు- అని అర్థం కాదు. బ్రహ్మాత్మకమైన పరమాత్మానుభవాన్ని పొందే ఉపాసకునకు ఇక అనుభావ్యవిషయం ఏదీ మిగిలి ఉండదు. కనుక ఇంక ఏమీ చూడడు, వినడు, తెలియడు - అని భావం. **"ఐశ్వర్యాపరపర్యాయగుణవిశిష్టం నిరతియ సుఖరూపం బ్రహ్మానుభవన్, తద్వ్యతిరిక్తస్య వస్తునోऽభావాదేవ కిమప్యన్యన్న పశ్యతి"** అని శ్రీరామానుజుల శ్రీభాష్యసూక్తి.

ఈ విద్యాసూచన తిరువాయ్మొழி ప్రబంధంలో (1-1-5) వ పాశురంలోని **"ఇఱైయవర్"** (సర్వశేషి) అనే పదంలో చేయబడిందని పూర్వాచార్యుల భావన. ఈ విద్యను ప్రస్తావించే భూమాధికరణంలో పరమాత్మయొక్క ఆనందవైభవాన్ని భూమశబ్దంచేత చెప్పినందువల్ల భూమగుణవిశిష్టుడు జీవుడు కాడు. పరమాత్మే - అని సిద్ధాంతం చేయబడింది. కనుక ఈ విద్యలో పరమాత్మయొక్క నిరతిశయానంద యోగాన్ని ప్రతిపాదించడం ప్రధానప్రమేయం. ఇది **"ఇఱైయవర్"** అని సర్వశేషిత్వాన్ని చెప్పే పదంచేత సూచితం. సర్వశేషికేకదా నిరతిశయానందం ఉంటుంది. అందువల్లనే కదా ఆనందవల్లిలో **"తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్"** అని ప్రారంభించి సర్వసంపదలతో పూర్ణం అయిన సమస్తపృథివిని కల్గి ఉండడాన్ని ఒక మనుష్యానందంగా చెప్పబడింది. **"ఇఱైయవర్"** అని అంటూ సర్వశేషిత్వాన్ని తెలుపగానే సర్వశేషిత్వప్రయుక్తం అయిన నిరతిశయానందయోగం కింపునర్న్యాయసిద్ధం కదా ! ఇదేవిధంగా **"ఎక్కాలత్తైయుమ్ ఎన్నుళ్ మన్నిల్ మఱ్ఱెక్కాలత్తిలుమ్ యాదొన్ఱుమ్ వేణ్డేన్"** (అత్యల్పకాలంలో అయినా ప్రాప్తశేషివై నాతో సంశ్లేషిస్తే, ఇక ఏ కాలంలోను దేనినీ కోరను) ఇత్యాది సూక్తులలోకూడా ఈ భూమవిద్య సూచింపబడిందని అనవచ్చు. ఇక్కడ సర్వశేషిత్వాన్ని తెలిపే **"ఎన్ఱై"** అనే శబ్దం, **"అన్యన్న పశ్యతి, న శ్రుణోతి, న విజానాతి"** అనే అర్థాన్ని ఇచ్చే **"యాదొన్ఱుమ్ వేణ్డేన్"** అనే శబ్దసందర్భం ప్రయోగింపబడడంకూడా గమనార్హం. తిరుప్పావైలోని 11వ పాశురంలోగల **"శిఱ్ఱాదే పేశాదే శెల్వప్పెణ్డాట్టి"** అనే సూక్తిలో ఈవిద్య సూచింపబడిందని చెప్పవచ్చు.

## 7. గాయత్రీవిద్య

బృహదారణ్యకోపనిషత్తులోని ఏడవ అధ్యాయంలోగల పదునాల్గవ బ్రాహ్మణం ఈ విద్యను పేర్కొన్నది. ఛాందోగ్యంలోని మూడవ అధ్యాయంలోకూడా (3-12-1) ఈ విద్యాప్రస్తావన ఉన్నది. బ్రహ్మసూత్రాలలోని జ్యోతిరధికరణంలో గల **"జ్యోతిశ్చరణా భిధానాత్"** (1-1-25) అనే సూత్రంలో ఈ విద్య ప్రస్తావింపబడింది.

గాయత్రిని ఉపాధిగా చేసికొన్న పరబ్రహ్మోపాసనాన్ని బృహదారణ్యాకం ఈ క్రిందివిధంగా తెలిపింది. దీనిని జనకుడు బుడిలునకు ఉపదేశించాడు. **"భూమి రంతరిక్షం దియౌః"** అనే ఎనిమిది అక్షరాలను కల గాయత్రిని మొదటి పాదంగా గ్రహించి, భూమ్యాదిలోకత్రయాత్మకంగా ఈ చరణాన్ని ఉపాసించినవాడు ముల్లోకాలను జయించగలడు. **"ఋచో యజూంషి సామాని"** అనే ఎనిమిది అక్షరాలను కల పాదాన్ని గాయత్రి ద్వితీయ చరణంగా వేదత్రయాత్మకంగా భావించి ఉపాసిస్తే మూడు వేదాలవల్ల కలిగే ఫలాన్ని పూర్ణంగా పొందుతాడు. **"ప్రాణః అపానః వియానః"** అనే ఎనిమిది అక్షరాలున్న గాయత్రి తృతీయపాదాన్ని ఉపాసించినవాడు ఈ ప్రాణిసమూహాన్ని వశం చేసికోగలడు. **"అథాస్యా ఏతదేవ తురీయం దర్శతం పదం పరోరజాః య ఏష తపతి యద్వై చతుర్థం తత్తురీయమ్, దర్శతం పద మితి...."** నాల్గవ పాదానికి **"దర్శతపద"**మని పేరు. అది పైన ఉండే సూర్యమండలంగా దర్శింపబడుతున్నది. అది పరోరజస్సు, రజస్తమోలోకాలను దాటి ఉంటుంది. అంటే- సూర్యమండలాంతర్గతుడు అయిన పరమాత్మే **"దర్శత"** పదంచేత వ్యవహరింపబడే నాల్గవపాదం. దీనిని తెలిసి ఉపాసించేవాడు జరామరణ శూన్యుడై, ముక్తిని పొందుతాడు. గయాలని ప్రాణాలకు పేరు. గయాలను రక్షిస్తుంది కనుక దీనికి గాయత్రి అని పేరు అని కూడా ఇక్కడ నిర్వచింపబడింది. **"ప్రాణ వై గయాః తత్ప్రాణాంస్తత్రే, తద్యద్గయాం స్తత్రే, తస్మాద్గాయత్రీ నామ"**- ఆచార్యుని చేత శిష్యునకు ఉపదేశింపబడ్డ ఈ గాయత్రి ఆ శిష్యుని ప్రాణాలను నరకపతనం నుండి రక్షిస్తుంది. కనుక గాయత్రి అని పేరు వచ్చింది. లోకత్రయ- వేదత్రయ- ప్రాణిజాతాంతర్గత అయిన సర్వఫలప్రాప్తి చతుర్థపాదం వల్ల కల్గుతుందని చెప్పినందున దీనిని ప్రతీకోపాసనగా, లౌకికఫలపర్యవసాయినిగా భావించే అవకాశం ఉన్నా, గాయత్రిలోని నాల్గవ పాదంగా పరోరజః పదాన్నిదాటి ఉండే పరమాత్మను ఉపాసించినవాడు శుద్ధుడు, పూతుడు, అజరుడు, మరణశూన్యుడు అవుతాడని అన్నందున ఇది ఒక విధంగా మోక్షవిద్యగా చెప్పవచ్చుననే ఉద్దేశ్యంతో బ్రహ్మవిద్యలలో ఒకటిగా పరిగణింపబడిందని చెప్పాలి. ఛాందోగ్యంలో ప్రస్తావింపబడ్డ పాదచతుష్టయాత్మక గాయత్రీవిద్యకు చెప్పబడ్డ ఫలం కూడా మోక్షమే కనుక వేర్వేరు చోట్ల చెప్పబడ్డ ఈ రెండూ ఫలైక్యాన్నిబట్టి, విషయైక్యాన్ని బట్టి సర్వవేదాంత ప్రత్యయన్యాయానుసారంగా ఒకే విద్యగా పరిగణించడం యుక్తం.

ఇక, ఛాందోగ్యోపనిషత్తులో తెలుపబడ్డ గాయత్రీ బ్రహ్మవిద్య క్లుప్తంగా ఈ విధంగా ఉన్నది. సామాన్యంగా గాయత్రీ **3** పాదాలను ఒక్కొక్క పాదంలో ఎనిమిది అక్షరాలతో ఇరవైనాల్గు అక్షరాలను కల్గినదిగా ఉంటుంది. కాని నాల్గు పాదాలు, ప్రతిపాదంలో ఆఱు అక్షరాల లెక్కన ఇరవై నాల్గు అక్షరాలను కల్గినదిగా భావించే



క్రమంలో ఈ విద్య ప్రస్తావింపబడింది. **"సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ"-** పాదచతుష్టయాత్మకమైన గాయత్రిగా పరబ్రహ్మను ఉపాసించే ఈ విద్యలో పరమాత్మకు చెప్పబడ్డ నాల్గు పాదాలు- భూతం, పృథివి, శరీరం, హృదయం- అనేవి. వాక్కు సర్వభూతాలను నిర్దేశించేది, రక్షించేది. కనుక సర్వభూతమయం అయిన పరబ్రహ్మ వాక్కుచేత నిర్దేశింపబడుతున్నది, రక్షింపబడుతున్నది. అందువల్ల **-"గాయతి, త్రాయతే -ఇతి గాయత్రీ"** అనే వ్యుత్పత్తినిబట్టి పరబ్రహ్మను గాయత్రిగా ఉపాసించాలి. పృథివిని పాదంగా కల పరబ్రహ్మకు సర్వభూతాలకు ఆధారంగా ఉండడం, వాటిచేత అతిక్రమించడానికి సాధ్యం కాకుండా ఉండడం- అనే రెండు గుణాలున్నాయి. శరీరాన్ని, హృదయాన్ని పాదాలుగా కల ఈ పరబ్రహ్మకు ప్రాణాలకు ఆధారంగా ఉండడం, వాటిచే అతిక్రమించడానికి సాధ్యం కాకుండా ఉండడం- అనే అంశాలున్నాయి. ఈ విధంగా నాల్గు పాదాలు, ఆఱు అంశాలు పరబ్రహ్మకు చెప్పబడ్డాయి. **"పాదోస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"** అని పురుషసూక్తంలో చెప్పిన రీతిలో ఈ ప్రకృతి, పరమపదాలలో వ్యాపించి ఉండే ఈ నాల్గు పాదాలను ఉద్దేశించి గాయత్రీరూపుడైన పరమాత్మను ఉపాసిస్తే **"పూర్ణా మప్రవర్తినీం శ్రియం లభతే"-** అనంతమైన, స్థిరమైన లక్ష్మి అంటే - మోక్షసామ్రాజ్యం లభిస్తుంది.

దీనికి అంగంగా హృదయంలోని నాల్గు దిశలు, ఊర్ధ్వదిశ అనే అయిదు దిశల్లో అయిదు ద్వారకుహరాలు ఉంటాయని, వాటిలో అయిదు ప్రాణాలు సంచరిస్తాయని, ఆ అయిదు ఛిద్రాలలో అయిదుగురు ద్వారపాలకులు ఆదిత్య, చంద్ర, అగ్ని, పర్జన్య, ఆకాశనామకులైన దేవతలు ఉంటారని భావించాలనికూడా చెప్పబడింది.

ఛాందోగ్యోక్తమైన గాయత్రీవిద్యలో మధువిద్య, దహరవిద్య, అక్షివిద్యవంటి పలు ఇతరవిద్యలకు సంబంధించిన విశేషాలు సూచింపబడ్డాయి- అని శ్రీ కె. నారాయణస్వామి అయ్యర్ అభిప్రాయం. వారు తమ గ్రంథంలో "But it is only the Gayatri vidya, as explanind in the third Adhyaya of chandogya upanishad, that furnishes us with the key to unravel the mysteries connected with the different vidyas" - అని అనడం ఈ విషయాన్ని తెలుపుతున్నది.

### 8. మధువిద్య

ఛాందోగ్యంలోని తృతీయాధ్యాయంలో మొదటి పదకొండు ఖండాలలో ఈ విద్య వర్ణింపబడింది. బ్రహ్మసూత్రాలలో మధ్వధికరణంలో **(1-3-30)** ఈ విద్యా

ప్రసక్తి ఉన్నది.

సూర్యమండలాన్ని దేవతలు ఆస్వాదించే తేనె అని, వృక్షంపై తేనెపట్టు ఉన్నట్లే పైలోకంలో అంతరిక్షమనబడే తేనెపట్టు ఉన్నదని, తుమ్మెదలు పుష్పాలనుండి మధువును గ్రహించి తేనె తుట్టలోనికి చేర్చేటట్లే, ఆయా వేదమంత్రాలు తమను ఉచ్చరిస్తూ చేసే యాగం మొదలైనవాటినుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియం, వీర్యం వంటి ఫలాలను గ్రహించి సూర్యమండలంలో ఒక్కొక్క ప్రక్కలో చేరుస్తాయని, వసు- రుద్ర- ఆదిత్య- మరుత్ - సాధ్యగణాలు అనే అయిదు గణాలు నాల్గు దిక్కులలో, ఊర్ధ్వదిశలో ఉండి దానిని చూచి సంతోషిస్తూ ఉంటారని భావించి, ఈ రీతిలో సూర్యుని మధువుగా ధ్యానం చేయడంతోపాటుగా సూర్యునకు అంతర్యామి అయిన పరమాత్మను ఉపాసిస్తే మొదట వసురుద్రాదిభోగం, ఆ తరువాత మోక్షం సిద్ధిస్తుంది- అని ఈ విద్యలో తెలుపబడింది.

## 9. షోడశకళబ్రహ్మవిద్య

ఛాందోగ్యోపనిషత్తులో **(4-4-9)**, ప్రశ్నోపనిషత్తులో **(6-1)** కన్పించేది, బ్రహ్మసూత్రాలలో పరాధికరణంలోని **"బుద్ధ్యర్థః పాదవత్"** అనే **(3-2-32)** సూత్రంలో ప్రస్తావింపబడినది అయిన ఈ విద్య సత్యకామునకు అనుగ్రహింపబడింది. (గురుశుశ్రూషద్వారా విద్యాప్రాప్తిని పొందే వైనం ఈ విద్యలో తెలుపబడింది. ఇది షోడశకలబ్రహ్మవిషయిణి) సత్యకాముడు జబాలా కుమారుడు. ఒకనాడతడు తల్లిదగ్గరకు వచ్చి "అమ్మా! నేను స్వాధ్యాయగ్రహణంకోసం ఆచార్యకులంలో బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించాలని అనుకుంటున్నాను. నా గోత్రమేమో చెప్పు''- అని అన్నాడు. అపుడు ఆమె "నాయనా ! నేను భర్తృగృహంలో చిరకాలం అతిథి- అభ్యాగతుల పరిచర్యలోనే గడుపుతూ, యౌవనంలో నిన్ను కన్నాను. అందువల్ల నీ గోత్రమేమో తెలియదు. "నేను జబాలా పుత్రుణ్ణి. సత్యకాముడనే పేరును కలవాడను. నా గోత్రమేమో తెలియదు- అని ఆచార్యునకు విన్నవించు'' అని అన్నది.

సత్యకాముడు గౌతమహరిద్రుమతునివద్దకు పోయి తన వివరాలను తెలియజేశాడు. **"సత్యకామో జాబాలోఽస్మి భోః"**. -అపుడు హరిద్రుమతుడు- "నీవు యథార్థాన్ని చెప్పావు. అందువల్ల నీవు బ్రాహ్మణుడవే" అని అతణ్ణి అనుగ్రహించి, ఉపనయనం కావించి, తన దగ్గరుండే పశువులలో బాగా చిక్కినవి, బలహీనమైనవి అయిన నాల్గువందల గోవులను విడదీసి వాటిని మేపి, పెంచి తిరిగి తీసికొని రమ్మన్నాడు. సత్యకాముడు ఆనందంతో "వీటిని వేయి సంఖ్యలో వృద్ధి చేసేంత



వరకు తిరిగిరాను''- అని పల్కి వెళ్ళిపోయాడు. చాలాకాలం ఆ గోవులను శ్రద్ధగా మేపి, వాటిని వేయిగా పెంచాడు. ఆ విధంగా సత్యకాముని గోసేవతో ప్రీతుడైన, దేవతావిశేషంచేత అధిష్ఠితమైన ఒక గోవు అతనితో- "సత్యకామా ! మేము సహస్రంగా పెరిగాముకదా! మమ్ములను ఆచార్యుని ఇంటికి తీసికొనిపో. బ్రాహ్మణుడవైన నీకు ఒక పాదాన్ని ఉపదేశిస్తాను'' అని అన్నది. ఆ గోవు- **"ప్రాచీ దిక్ కలా, ప్రతీచీ దిక్ కలా, దక్షిణా దిక్ కలా, ఉదీచీ దిక్ కలా, ఏష వై సోమ్య చతుష్కః పాదో బ్రహ్మణః"**- గోవునకు నాల్గు పాదాలు ఉన్నట్లే పరబ్రహ్మకుకూడా నాల్గు పాదాలున్నాయి. ప్రాణాది దిక్కులు నాల్గు పరబ్రహ్మకు గల ఒక పాదానికి కళలుగా, అంటే- అవయవాలుగా భావించి, **"ప్రకాశవాన్"** నామంతో ఉపాసించాలి. ఈ విధంగా ఉపాసిస్తే ఈ లోకంలో ప్రకాశవంతుడై, జయాన్ని పొందుతాడు- అని ఉపదేశిస్తూ, వేఱొక పాదాన్నిగూర్చి అగ్ని ఉపదేశిస్తుంది- అని అన్నది.

మఱునాడు సత్యకాముడు గోవులను తీసికొనిపోయి, దారి నడుమలో సాయంవేళ సమిదాధానం చేసేటపుడు అగ్ని **"ఆనందవాన్"** అనే రెండవ పాదాన్ని గూర్చి ఉపదేశిస్తూ **"పృథివీ కలా, అంతరిక్షం కలా, ద్యౌః కలా, సముద్రః కలా"- "పృథివి, అంతరిక్షం, ద్యౌః, సముద్రం"**- అనే నాల్గు రెండవ పాదానికి గల నాల్గు కళలు. ఈ పాదాన్ని ఈ పేరుతో భావించి ఉపాసిస్తే అనంతమైన లోకాలను జయిస్తాడు. వినాశాన్ని పొందడు- అని అన్నది. ఇంకొక పాదాన్ని నీవు హంసవల్ల తెలిసికొంటావు అని కూడా అన్నది. ఇదే రీతిలో మరునాటి సాయంకాలం హంస మూడవపాదాన్నిగూర్చి పల్కుతూ, **"అగ్నిః కలా, సూర్యః కలా, చంద్రః కలా, విద్యుత్ కలా"** అని అంటూ అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు అనే కళలను కల **"జ్యోతిష్మాన్"** అనే నామాన్ని కల్గిన పాదాన్ని పరమాత్మగా ఉపాసిస్తే తేజస్వి అవుతాడు, అగ్ని సూర్యాదిలోకాలను పొందుతాడు- అని అన్నది. మిగిలిన నాల్గవ పాదాన్ని మద్గు అనే జలపక్షివిశేషం తెలుపుతుంది- అని అన్నది. మరునాడు సాయంకాలం సత్యకామునకు **"మద్గు"** అనే జలపక్షి **"అయతనవాన్"** అనే పేరును కల్గిన చతుర్థపాదాన్ని ఉపదేశిస్తూ- **"ప్రాణః కలా, చక్షుః కలా, శ్రోత్రం కలా, మనః కలా"**- దాని నాల్గు కళలు ప్రాణం, చక్షువు, శ్రోత్రం, మనస్సు అని పల్కి, ఈ పాదాన్ని పరబ్రహ్మగా ఉపాసించినవాడు. ఆశ్రయాన్ని కల్గినవాడవుతాడని అన్నది. ఈ రీతిలో నాల్గు పాదాలకు సంబంధించిన షోడశకళలను తెలిసికొనిన సత్యకాముడు ఆచార్యుని సన్నిధికి చేరాడు. అతణ్ణి చూచి ఆచార్యుడు- "సత్యకామా ! నీవు బ్రహ్మజ్ఞానాన్ని పొందినట్లు తోస్తున్నది. దానిని నీకు ఎవరు బోధించారు? అని అడిగాడు. తనకు ఉపదేశించినవారు మానవులు కారని పల్కి సత్యకాముడు తాను ఆవిద్యను ఆచార్యముఖంగా పొందినపుడే అది ఫలప్రదం అవుతుంది. కనుక

తనకు ఆ విద్యను ఉపదేశించమని ప్రార్థించాడు. ఆచార్యుడు షోడశకళబ్రహ్మవిద్యను అంతటినీ ఒక్కమారుగా సత్యకామునకు బోధించాడు. షోడశకళాత్మకుడైన పరబ్రహ్మను గూర్చిన ఈ ఉపాసన ఉపాస్యవైశిష్ట్యాన్నిబట్టి పరవిద్యగా లెక్కించవచ్చునని కొందరి భావన.

## 10. పర్యంకవిద్య

ప్రసిద్ధాలైన ఈశాది దశోపనిషత్తులలోనే కాక కౌషీతకి, సుబాలోపనిషత్తు మొదలైన మిగిలిన ఉపనిషత్తులలోకూడా పరవిద్యల ప్రసక్తి ఉన్నది. అటువంటి విద్యలలో పర్యంకవిద్య ఒకటి. ఈ విద్యను కౌషీతకి ఉపనిషత్తులోని ప్రథమాధ్యాయం వర్ణించగా, శ్రీభాష్యంలోని సాంపరాయాధికరణంలో దీని ప్రసక్తి ఉన్నది. అయితే, ఈ విద్యను గూర్చిన ఇదమిత్థమైన సూత్రం మాత్రం బ్రహ్మసూత్రాలలో కన్పించదు. ఛాందోగ్యంలో కూడా పంచమాధ్యాయంలో అర్చిరాదిగతినిగూర్చిన ప్రస్తావన ఉన్నది.

గార్గ్యుని పుత్రుడైన చిత్రుడు తాను చేయదలచిన యాగాన్ని నిర్వహించమని అరుణుని పుత్రుడైన గౌతముని కోరగా గౌతముడు తన కుమారుడైన శ్వేతకేతువును ఆ పని కోసం పంపాడు. చిత్రుడపుడు శ్వేతకేతువును చూచి - "గౌతమపుత్రా ! నేను గాని, ఇతరులుగాని ఇటువంటి యాగాలను చేసి, తత్ఫలంగా చేరే లోకాన్ని గూర్చిగాని, మార్గాన్నిగూర్చిగాని నీకు తెలుసునా ?'' అని ప్రశ్నించాడు. శ్వేతకేతువు ఈ ప్రశ్నకు బదులు చెప్పలేక, తండ్రివద్దకు పోయి అడిగాడు. అపుడు గౌతముడు - "ఏదో సదస్సులో వేదాన్ని అధ్యయనం చేసి, ఇతరులు ఇచ్చే దాన్ని తీసికొని హోమాన్ని నిర్వహిస్తున్నాము. నాకుకూడా ఈ రహస్యాన్నిగూర్చి తెలియదు. ఇద్దరం పోయి రాజును అడిగి తెలిసికొందాం, రా'' అని అంటూ రాజువద్దకు వచ్చాడు. అపుడు చిత్రుడీవిధంగా ఇద్దఱికీ ఆ విద్యారహస్యాన్ని తెలిపాడు.

ఇష్టాపూర్తాది సత్కర్మలను ఆచరించినవారు ఈ లోకంనుండి అర్చిర్దినపూర్వపక్ష - ఉత్తరాయణసంవత్సరవాయులోకాది క్రమంలో చంద్రుణ్ణి చేరతారు. వారి ఇంద్రియాలతో పూర్వపక్షంలోని చంద్రుడు వృద్ధి చెందుతాడు. చంద్రుడు పరమపదలోకానికి దౌవారికుడవుతాడు. అతడు అడిగే ప్రశ్నకు సమాధానాన్ని చెప్పినవారిని అతడు విడచిపెడతాడు. చెప్పనివారిని కీటాదిజన్మలు పొందేటట్లు అధోగతిపాలు చేస్తాడు. చంద్రుడు తనవద్దకు వచ్చినవారిని "నీవు ఎవరు'' అని అడుగుతాడు. అందుకు తగిన బదులు ఏమంటే- "పంచాగ్నివిద్యోక్తప్రకారం అయిదు స్థితులను పొంది శుక్లశోణిత సంయోగంవల్ల పన్నెండు పదమూడు మాసాలలో పుట్టినవాడను నేను. ఇక నన్ను నీవు ఈవిధంగా విడువవద్దు. సత్యమనే భగవానునిచేత తపఃఫలితంగా నేను సర్వరూపి అయ్యాను''-



అని. ఈ విధంగా సమాధానం చెప్పిన జీవుని చంద్రుడు విడచిపెడతాడు. అతడు అపుడు దేవయానం అనబడే అర్చిరాదిగతిలో అగ్నిలోకం, వాయులోకం, వరుణలోకం, ఆదిత్యలోకం, ఇంద్రలోకం, చతుర్ముఖలోకం, బ్రహ్మలోకం- అనే రీతిలో పయనిస్తాడు.

బ్రహ్మలోకంలో అర మనబడే మడుగు ఉన్నది. (ఛాందోగ్యంలో **"అరశ్చణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే ఐరమ్మదీయం సరః"** అని మూడు మడుగులున్నట్లు చెప్పబడింది) ఈ మడుగుకు అనతిదూరంలోనే దండపాణులైనవారుంటారు. వీరు బ్రహ్మ వేత్తలు కానివారిని ఎవరినీ ఆ దరికి రానివ్వరు. అక్కడ ఉండే నది విరజ(విజర) దానికి సమీపంలో తిల్యమనబడే వృక్షం. (ఛాందోగ్యంలో ఇది సోమసవన మనబడే అశ్వత్థం). అక్కడ ప్రాకారాలలో యుద్ధసాధనాలను కల, సాలజ్యమనే చోట అపరాజితమనబడే రాజధాని ఉన్నది. ఇంద్రుడు ప్రజాపతి - అనే ఇద్దరు ఆ పట్టణానికి ద్వారపాలకులు. అందులో విస్తృతినికల్గి ఉన్నందున ప్రభువిమత మని, విభుప్రమితమని చెప్పబడే మండపం, దానిలో విచక్షణా అనబడే పీఠం ఉన్నాయి. అక్కడ అంతు లేని తేజస్సును కల్గినందువల్ల **"అమితౌజాః"** అనబడే యోగపర్యంకం ఉన్నది. మనస్సును, వాక్కును వశీకరించుకొనే **"ప్రియా', ప్రతిరూపా"** అని పేర్లను కల దేవులు ఇద్దరు పుష్పాలను కోస్తూ ఉంటారు. అక్కడ వీరే కాక, ఇటువంటివారు లెక్కలేనంతమంది స్త్రీరత్నాలు ఆనందకోలాహలం చేస్తూ, ప్రకాశిస్తూ ఉంటారు. అటువంటి బ్రహ్మలోకాన్ని ముక్తుడు చేరతాడు.

అపుడు భగవానుడు అతనిని చూచి- "నా అనుగ్రహంవల్ల ఇతడు విరజదగ్గరకు వచ్చాడు. ఇక దానిని దాటి త్వరగా వస్తాడు'' అని అంటాడు. ఆ విధంగా వచ్చిన ముక్తునకు స్వాగతం పల్కడంకోసం అయిదువందలమంది స్త్రీలు పరుగెత్తివస్తారు. చేతులలో పూలమాలెలతో నూఱుమంది, కాటుకను చేతిలో పెట్టుకొని నూఱుమంది, చందనపు పొడిని తీసికొని నూఱుమంది, పట్టువస్త్రాలను తీసికొని నూఱుమంది, దివ్యాభరణాలను తీసికొని నూఱుమంది వస్తారు. వారు అందఱు ముక్తుని ముక్తాలంకారంతో అలంకరిస్తారు. ఆ విధంగా వారు తనకు పలు అలంకారాలు చేస్తున్నా అతడు మాత్రం పరబ్రహ్మదర్శనంలోనే ఔత్సుక్యాన్ని కల్గి ఉంటాడు. అపుడతడు పరమాత్మవద్దకు సగౌరవంగా వస్తాడు. అర్చిరాది మార్గంలో పయనించిన ముక్తుడు అరమనబడే మడుగును సంకల్పమాత్రంతో దాటిరావడాన్ని చూచిన ముహూర్తులనబడే దండపాణులు అతనికి దూరంగా వెళ్ళిపోతారు. అపుడు ముక్తుడు విరజ దగ్గరకు వచ్చి, దానినికూడా సంకల్పమాత్రంతోనే దాటతాడు. ఇతని పాపాలను ఇతని శత్రువులు, పుణ్యాన్ని మిత్రులు, సొత్తును పుత్రులు పొందగా, పుణ్యపాపాలను వీడినవాడై బ్రహ్మను

పొందడానికి సిద్ధం అవుతాడు.

అతడు తిల్యమనే వృక్షాన్ని సమీపించినపుడు పరబ్రహ్మయొక్క దివ్యగంధం ఇతని శరీరానికి సోకుతుంది. సాలజ్యమనబడే సంస్థానాన్ని చేరినపుడు పరబ్రహ్మయొక్క దివ్యమైన తిరుమేని రసం అతని శరీరాన్ని చేరుతుంది. అపరాజిత మనబడే రాజధానిని ప్రవేశించినపుడు బ్రహ్మతేజస్సు ఇతనిని పొందుతుంది. తరువాత ఇంద్రుడు, ప్రజాపతి అనే ద్వారపాలకుల దగ్గరకు ఇతడు వస్తాడు. వారు ఇతనిని చూడగానే ఆవలివైపుకు వెళ్ళడానికి దారిని ఇస్తారు. విభు ప్రమితమనే మండపసమీపానికి చేరగానే బ్రహ్మయశస్సు ఇతనిని చేరుతుంది. విచక్షణా అనబడే పీఠాన్ని సమీపించినపుడు ప్రజ్ఞ ఇతనిలో వ్యాపిస్తుంది. (పీఠానికి ప్రజ్ఞ అధిదేవత కనుక దాని సంబంధంవల్ల అతడు అన్నీ చూడగలడు అని భావం) ప్రాణాన్ని అభిమానిదేవతగా కల **"అమితౌజాః"** - అనే పడుకలో వేంచేసి ఉండే పరమాత్మను చేరడంకోసం ముక్తుడు ఆ పడుకపై కాలు పెట్టి అధిరోహిస్తాడు. ఆ పడుకకు భూతం, భవిష్యత్తు ముందు రెండు కాళ్ళు. **"శ్రీః, ఇరా"**- అనేవి వెనుక రెండు కాళ్ళు. బృహద్రథంతరాలనే సామలు రెండు ఆ పర్యంకానికి నిలువుగా ఉండే కొయ్యలు. భద్రయజ్ఞాయజ్ఞీయాలనే సామలు అడ్డంగా ఉండే కొయ్యలు. ఋక్కులు, సామలు ఆ పర్యంకానికి నిలువుగా అల్లిన దారాలు. యజుస్సులు అడ్డంగా అల్లిన దారాలు. చంద్రుని కిరణాలు పఱచిన దుప్పటి. ఉద్గీథం లక్ష్మీసమీపంలోని తలదిండు. లక్ష్మి పాదపీఠం. ఇటువంటి పర్యకంపై ఉండే పరమాత్మ తన వద్దకు వచ్చిన ముక్తుని చూచి "నేను ఎవరు?'' అని ప్రశ్నించినపుడు "నీవు సత్యానివి'' అని బదులివ్వాలి. పరమాత్మ "సత్యం అంటే ఏమి ?'' అని ప్రశ్నించినపుడు **"సత్"** అన్నది దేవతల కంటే, ప్రాణాలకంటే విలక్షణమైనది. **"త్యమ్"** అని అంటే దేవతలు, ప్రాణాలు. అందువల్ల సత్యమంటే సర్వం. అంటే, సర్వం పరబ్రహ్మాత్మకం. నీవు సర్వాత్మకుడవు- అని బదులివ్వాలి. "స్వర్గలోకంనుండి ఆకాశం, వాయువు మొదలైన వానిద్వారా క్రిందకు వచ్చి ఎన్నో రూపాలలో నేను జన్మించాను. నీవు సర్వభూతాలకు, నాకు ఆత్మవు. సర్వవేదమయుడవు. మనోవాక్కాయాలతో, మిగిలిన సాధనాలతో స్త్రీపురుషనపుంసకాది రూపాలను పూర్వం పొంది, ఆ సాధనాలకు తగిన జ్ఞానాన్ని పొందాను. దేహ- ఇంద్రియ - మనః-ప్రాణజ్ఞానాలకంటే విలక్షణుడను అయిన నేను నిన్ను ఆత్మగా కలవాడను. నీకే శేషభూతుడను-'' అని బదులివ్వాలి. అపుడు పరమాత్మ తనకు భోగ్యాలు, అనుభవయోగ్యాలుగా ఉండే లోకాలను ఇతనికికూడా భోగ్యాలుగా అనుభవయోగ్యాలుగా అనుగ్రహిస్తాడు. ఈ పర్యంకవిద్యను ఉపాసించినవాడు జయాన్ని, యోగాన్ని పొందుతాడు.

వరుణలోకంనుండి ముక్తపురుషునకు దారి చూపిస్తూ వచ్చే వైద్యుతపురుషుడు



వేఱు. అతడు విరజవరకు వచ్చి వెనుతిరిగి పోతాడు. విరజాస్నానానంతరం ముక్తుని తీసికొనిపోయే అమానవపురుషుడు వేఱు. ఇతడు ముక్తుని తనచేతితో స్పృశించి దివ్యదేహాన్ని ప్రసాదిస్తాడు. ఈ విషయం శ్రీ పిళ్ళై లోకాచార్యులవారి అర్చిరాది గ్రంథంలో స్పష్టం.

ఈ పర్యంకవిద్యాప్రసక్తి తిరువాయ్‌మొழி ప్రబంధంలోని **"అణైవదు అరవణైమేల్"** (2-8-1) అనే పాశురంలోను, **"శూழ் విశుమ్బు"** (10-9) అనే దశకంలోను **"తేవిమారావార్"** (8-1) అనే పాశురంలోను ప్రస్తావింపబడిందన్నది పూర్వాచార్యాభిమతం. అక్కడ ఈడువ్యాఖ్యలో ఈ విషయం సుస్పష్టం. "శూழ்విశుమ్బు'' అనే దశకంలో **"శతం మాలాహస్తాః శత మంజనహస్తాః"** ఇత్యాది శ్రుతుల అర్థం యథాతథంగా అనివదింపబడింది. విష్ణుసహస్రనామాలలో **"జ్యోతిః , సురుచిః, హుతభుగ్విభుః, సుఖదః, నైకదః, అగ్రజః"** - ఇత్యాది నామాలలో ఈ విద్య ప్రసక్తమైనదని శ్రీపరాశరభట్టర్‌భాష్యాన్ని బట్టి గ్రహించవచ్చు. తిరుప్పావైలోని **"కుత్తువిళక్కు ఎరియ"** అనే పాశురంలో (19) కూడా ఈ విద్యాప్రసక్తి ఉన్నదని పెద్దల నిర్వాహం ఒకటి ఉన్నది.

## 11. పరమపురుషవిద్య

ప్రశ్నోపనిషత్తులో **(5-5)** ఈవిద్య విధింపబడగా, శారీరక మీమాంస మొదటి అధ్యాయంలో **(1-3-12)** ఈ విద్య విచారింపబడింది. మూడు మాత్రలను కల ప్రణవమనబడే అక్షరంలో పరమపురుషుని ధ్యానం చేసే విద్య ఇది. దీనివల్ల పరమాత్మప్రాప్తి కల్గుతుందని ఈ విద్య తెలుపుతున్నది. **"యః పున రేతం త్రిమాత్రేణైవోమిత్యే తేన వాऽక్షరణేణ వరం పురుష మభిధ్యాయీత"** అనే ప్రశ్నోపనిషద్వాక్యం దీన్ని విధిస్తున్నది. దీనిని పరమవైదికశిఖామణులైన పెరియాழ்వార్లు **"మూల మాకియ ఒన్ఱై ఎழுత్తై మూన్ఱు మాత్తిరై ఉళ్ళెழవాఙ్గి వేలైవణ్ణనై మేవుతిరాకిల్ విణ్ణకత్తినిల్ మేవలుమామే"** (4-7-10) అని తెలిపారు. కొందఱు ఈ విద్యకు కఠవల్లిలోని **'ఋతం పిబంతౌ పురుషస్య లోకే'** (3-1) అనే వాక్యాన్ని విషయవాక్యంగా చెప్పారు. కాని, పూర్వం ఉదాహరించిన వాక్యం ఈ విద్య పేరు స్పష్టంగా ప్రతిపాదించినందున, **"ఋతం పిబంతౌ"** ఇత్యాదివాక్యం నాచికేత విద్యాప్రకరణంలోనిది అయినందున పైవాక్యాన్నే విషయవాక్యంగా చెప్పడం యుక్తం.

## 12. ప్రతర్దనవిద్య

ప్రతర్దనుడు తన పరాక్రమంతో ఇంద్రలోకాన్ని చేరాడు. అతనిపట్ల ప్రీతిని

పొందిన ఇంద్రుడు అతనిని మూడు వరాలను కోరుకొమ్మన్నాడు. ప్రతర్దనుడు అపుడు- మానవులకు ఏది పరమహితమని తలుస్తున్నావో దానిని ఉపదేశించు- అని అడిగాడ. అపుడు ఇంద్రుడు **"ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా, తం మామాయు రమృత మిత్యుపాస్వ"** - "నేను ప్రాణాత్మగాను, ప్రజ్ఞాత్మగాను ఉన్నాను. నన్ను ఆ అమృతస్వరూపునిగా ఉపాసించు" అని అన్నాడు. ఇక్కడ **"మామ్"** అన్నది ఇంద్రుని అంతర్యామి అయిన పరమాత్మను. ఈ విద్యకూడా విశిష్టాద్వైతసిద్ధాంత ప్రధానప్రతితంత్రార్థం అయిన చిదచిత్తులకు పరమాత్మకు మధ్యగల శరీరాత్మభావాన్ని తెలుపుతున్నది. నమ్మాళ్వార్లు ఈ విద్యను తిరువాయ్మొళిలో **"కడల్ ఞానమ్ శెయ్‌దేనుమ్ యానే ఎన్నుమ్"** (5-6) అనే దశకంలో తమకు అంతర్యామి అయిన పరమాత్మ చేసే జగత్సృష్ట్యాదులను తామే చేసేటట్లు పల్కడంద్వారా సూచించగా, తిరుమళ్ళై ఆళ్వార్లు **"వడవరై నిన్‌ఱుమ్"** (8-2-6) అనే పాశురంలో దీనిని ఉపబృంహణం చేశారు. విష్ణుసహస్రనామాలలోని **"ప్రాణః"** (322) అనే నామంలో ఈ విద్య అనుసంధింపబడింది.

## 13. న్యాసవిద్య

ఈ విద్యకు సంబంధించిన కరణమంత్రాలు **"వసురణ్యో విభూరసి..... ఓమిత్యాత్మానం యుంజీత", "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం ....... శరణ మహం ప్రపద్యే"** ఇత్యాదిగా పలు ఉన్నా కఠవల్లీగతమైన ద్వయమంత్రాన్నే ప్రధానంగా మన పూర్వాచార్యులు అవలంబించారు. ఈ విద్యను నమ్మాళ్వార్లు తిరువాయ్మొళిలో- **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్‌మేల్‌మఙ్గైయుఱై మార్బా ! నికరిల్ పుకళాయ్ ! ఉలకమ్ మూన్‌ఱుడైయాయ్ ! ఎన్నై ఆళ్వానే ! నికరిల్ అమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే ! పుకలొన్‌ఱిల్లా వడియేన్ నిన్నడిక్కీళ్ అమర్‌న్దు పుకున్దేనే"** (6-10-10) అనే పాశురంలో ప్రతిపాదించారు. ఈ ప్రబంధప్రారంభంలోగల పాశురంలో ప్రణవంలోని అకార, ఉకార, మకారాలను మొదటి మూడుపాదాల ప్రారంభంలో ప్రయోగిస్తూ, చివరిపాదంలో **"తొళుదు ఎన్ మననే"** అని శఠకోపసూరి అనడం న్యాసవిద్యను ఉపదేశించే **"ఓమిత్యాత్మానం యుంజీత"** అనే శ్రుతివ్యాక్యాన్ని అనువదించడమే. ఈ విధంగా ప్రారంభంలో ప్రతిపాదించిన న్యాసవిద్యను ఈ ప్రబంధంలో మిగిలిన భాగం విస్తృతంగా వివరిస్తున్నది. కావుననే ఇది శరణాగతి ప్రబంధమైనది. **"నిన్‌ఱడైక్కలమ్ పుకున్ద ఎన్నై"** (91) అనే తిరుచ్చన్దవిరుత్త సూక్తి. **"నెఱి వాశల్ తానేయాయ్ నిన్‌ఱానై"** (ముదల్ తిరువన్దాది-5) అనే సరోయోగిసూక్తి, **"అడియేనై అడియావి అడైక్కలమే"** అనే తిరువిరుత్తసూక్తి (85) వంటి పలు సూక్తులు ఈవిద్యామాహాత్మ్యాన్ని ఉగ్గడిస్తున్నాయి.



బ్రహ్మవిద్యలన్నీ పరమప్రాప్తి సాధనాలే అయినా ఈ న్యాసవిద్య మిగిలిన విద్యలకంటే విలక్షణమైనది. ప్రధానమైనది. దీనికి పలు కారణాలున్నాయి. మిగిలిన విద్యలను దేహావసానంవరకు ఉపాసించాలి, త్రైవర్ణికజన్మలో ఆరంభించవలసి ఉన్నది, ప్రారబ్ధకర్మలను తప్ప మిగిలిన కర్మలను పూర్తిగా పోగొట్టుకొనవలసియే ఉన్నది, స్వయత్నసాధ్యం అయిన భగవద్విషయరూప అంతిమస్మృతి ఆవశ్యకం. స్వవర్ణాశ్రమధర్మాలను ఇతికర్తవ్యతా రూపంగా కల్గినవి, వాటిలో అశక్యాలైనవాని పూర్తికోసం ఈ న్యాసవిద్యనే అంగంగా అనుష్ఠింపవలసి ఉన్నది. ఉపాసకునిమాత్రమే ఇవి రక్షిస్తాయి. ఇక న్యాసవిద్య అయితే- **"సకృదుచ్చారణేన"** అన్నట్లు సకృత్ కర్తవ్యం. **"సాధ్యభక్తి స్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** అన్నట్లు ప్రపన్నుని ప్రారబ్ధకర్మలను కూడా పోగొడుతుంది. అందఱికీ ఆచరణీయమైనది, న్యాసవిద్యానుష్ఠానానంతరం చేసే నిత్యకర్మలు అన్నీ స్వయంప్రయోజనా లైన పురుషార్థరూపాలే తప్ప, ఇతికర్తవ్యతారూపాలు కావు. బ్రహ్మాస్త్రంవంటి ఈ ఉపాయానికి వేఱొక ఉపాయం యొక్క ఆవశ్యకత లేదు. అంతిమస్మృతికూడా ఆవశ్యకం కాదు, తానను తలచిన మఱుక్షణంలోనే ఆర్తులకు **"ఆశుఫల"**. ప్రపన్నుని సంబంధిసంబంధులవరకు **"కేశవన్‌తమర్‌కీళ్‌మేల్ ఎమరేలెళుం పిఱప్పుమ్"** అని అన్నట్లు భగవానుని అనుగ్రహం ప్రసరిస్తుంది. ఈ న్యాసవిద్యావైభవాన్ని శ్రుతి **"తస్యైవం విదుషో యజ్ఞస్య"** అని ప్రారంభించి రూపక ప్రక్రియలో కీర్తించగా, స్మృతులుకూడా **"నార్హంతి శరణస్థస్య కలాం కోటితమీ మపి"** అని పొగిడాయి.

ఈ విద్య 32 బ్రహ్మవిద్యలలోకి చేరుతుందా? ప్రత్యేకమైనదా? అనే విషయంలో ఆచార్యులమధ్య కొంత అభిప్రాయభేదం ఉన్నది. తెన్నాచార్య (తెన్‌కలై) సంప్రదాయంలో పరగతస్వీకారమే ప్రధానం. చేతనుని ఆశ్రయణం సాధనమైతే అది అహంకారగర్భం అవుతుంది. ఈ విద్య బ్రహ్మవిద్యలలో చేరినదైనా **"అదువుమ్ అవనదు ఇన్నరుళే"** అనే ఆళ్వార్ల సూక్తిని అనుసరించి, మిగిలిన అన్నిటికంటే విలక్షణమైనదని, లేకపోతే త్రైవర్ణికులకుమాత్రమే ఆచరణీయాలుగా చెప్పబడే మిగిలిన బ్రహ్మవిద్యలవంటిదే అవుతుంది. ఈ విద్య సర్వాచరణీయం కాదని, అందువల్లనే న్యాసవిద్యను సాధ్యభక్తిగా పూర్వాచార్యులు భావించారని, ఆళ్వార్లు చేసిన శరణాగతి ఇదేనని, లేకపోతే, ఆళ్వార్లకే శరణాగతి చేసే అవకాశమే ఉండి ఉండదని **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** అనే తిరువాయ్మొళి దశక (1-2) ప్రవేశంలో, **"శార్వే తవనెఱి"** (10-4) దశకప్రవేశంలో నిరూపింపబడింది. ఈ సమన్వయం భగవానుని నిరుపాధిక రక్షకత్వాన్ని దృష్టిలో పెట్టుకొనిచేయబడింది.

ఆప్తతముడైన వేదపురుషుడు దుష్కరాలైన ఉపాయాంతరాలను, వాటిద్వారా దురారాధ్యులైన అగ్నీంద్రాదులకు దేవతాంతర్యామి అయిన ఈశ్వరుని సాధ్యునిగా

ఉపదేశించడం ఎందుకంటే - ఆ ఉపాయాంతరాల దుష్కరత్వాలను, అగ్నీంద్రాదుల దురారాధ్యత్వాలను చూచి, ఆ ఉపాయాలతో ఆయా దేవతాంతరాలను ఆరాధించడం మానివేసి, అసాధారణదివ్యమంగళవిగ్రహవిశిష్టుడై, సుఖారాధ్యుడైన భగవానునే ఉపాయంగా ఆశ్రయిస్తారనే ఉద్దేశ్యంతోనే - అని అంటూ శ్రీవరవరమునులు, దొడ్డయాచార్యస్వామివారు ముముక్షుప్పడి-చరమశ్లోకప్రకరణవ్యాఖ్యలో చేసిన వివరణాన్నిబట్టికూడా న్యాసవిద్యకు, విద్యాంతరాలకంటే గల భేదం, అతిశయం సుస్పష్టం. **"తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః"** అని శ్రుతికూడా-ఈ వైలక్షణ్యాన్ని తెలిపింది. అందువల్ల న్యాసవిద్యను ప్రత్యేకవిద్యగా పరిగణించడమే యుక్తతరం.

శ్రుతిచోదితాలైన ఈవిద్యల ఉపాసనవల్ల లౌకికపురుషార్థప్రాప్తి, ఉత్తమగతివంటి వైయక్తికలాభాలే కాక, సాంఘికప్రయోజనంకూడా కల్గుతుంది. ప్రతీకోపాసనలలోను, శాండిల్య, భూమాది పలు పరవిద్యోపాసనలలోను ఈ జగత్తు అంతా భగవదాత్మకంగా ఉపాసించాలి అని తెలుపబడింది. అటువంటి జ్ఞానాన్ని కల్గి ఉపాసిస్తే జగత్తు అంతా పరమాత్మ స్వరూపంగా తోస్తుంది. అపుడు పరస్పరవైషమ్యాలు, వైరుధ్యాలు సంఘంలో తొలగిపోతాయి, సమాజశ్రేయస్సు, ప్రశాంత వాతావరణం ఏర్పడుతుంది. ఈ దృష్టితోకూడా ఈ విద్యల ఉపాసనను వేదం విధించింది. ఈనాటికీ అవి ఆచరణ యోగ్యాలు అనడంలో సందేహం లేదు. సాధనబుద్ధితోగాక భగవదాజ్ఞాపరిపాలనారూపంగా ఈనాటికి ఆచరణలో కొన్ని విద్యలు ఉన్నాయి అనేదానికి సంధ్యావందనంలో చివర ఉపస్థానంలో అనుసంధించే **"ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ"** అనే శ్లోకం అంతరాదిత్యవిద్యను సూచించడం ఒక ఉదాహరణంగా గ్రహించవచ్చు. ముముక్షుప్పడి గ్రంథంలోని చరమశ్లోక ప్రకరణలో గల **"కర్మమ్ కైంకర్యత్తిలే పుకుమ్, జ్ఞానమ్ స్వరూపప్రకాశత్తిలే పుకుమ్, భక్తి ప్రాప్తిరుచియిలే పుకుమ్"** అనే సూత్రం, దానికి శ్రీ వరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్య, దానిని వివరించే శ్రీ దొడ్డయాచార్యస్వామివారి అరుంబదం ఈ సందర్భంలో అనుసంధేయాలు.

బ్రహ్మవిద్యలకు సంబంధించిన విషయాలను సమగ్రంగా అందించే గ్రంథం ఇంతవరకు సంస్కృతంలో కాని, ఏ ఇతరభాషలో గాని రాకపోవడం విశేషం. బహుశః బ్రహ్మసూత్రభాష్యాలలో, ఉపనిషద్భాష్యాలలో దీనికి సంబంధించిన అంశాలన్నీ గతార్థాలనే ఉద్దేశ్యంతో ఎవరూ ఈ ప్రయత్నాన్ని చేసి ఉండకపోవచ్చు. ఇప్పటికి సుమారు నూఱు సంవత్సరాలకు ముందు ప్రచురింపబడ్డ వాత్స్యవేంకటరాఘవాచార్యులవారి శ్రీభాష్యార్థ సంగ్రహం మణిప్రవాళ గ్రంథం



చివరలో బ్రహ్మవిద్యలు, ప్రతీకోపాసనలు చూపబడ్డాయి. భగవద్గీత-శ్రీరామానుజభాష్యానికి శ్రీమాన్ గోవిందాచార్యులవారి ఆంగ్లానువాదగ్రంథం చివరలోకూడా వీటి వివరం ఇవ్వబడింది. 1916వ సం॥లో శ్రీ కె. నారాయణస్వామి అయ్యర్‌గారి Thirty two Brahma vidyas అనే ఆంగ్లగ్రంథం బ్రహ్మవిద్యల స్వరూప స్వభావాలనుగూర్చి కొంతవరకు చర్చించింది. ఇది అడైయార్‌లైబ్రరీ, చెన్నైవారి ద్వారా పలుమార్లు ముద్రింపబడింది. 1933వ సం॥లో తమిళంలో ముద్రింపబడ్డ శ్రీహస్తిగిరిమాహాత్మ్య వ్యాఖ్యానగ్రంథంలో చేట్లూరి నరసింహాచార్యస్వామివారు 32 బ్రహ్మవిద్యల వివరం కొంత ఇచ్చారు. మహావిద్వాన్ కపిస్థలందేశికాచార్యస్వామివారి అధికరణరత్నమాలా గ్రంథాన్ని ప్రచురిస్తూ శ్రీమాన్ శ్రీనివాసరాఘవన్‌గారు ఆ గ్రంథానుసారం బ్రహ్మవిద్యలను, వాటి విషయవాక్యాలను, ప్రతీకోపాసనలను చివరలో ఇచ్చారు. ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు బృహదారణ్యకోపనిషత్తు- (రంగరామానుజభాష్యంతో) భూమికలో దశోపనిషత్తులలోని, బ్రహ్మసూత్రాలలోని ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యలను, ప్రతీకోపాసనలను లెక్కించి చూపారు. పూర్వం చెప్పిన రీతిలో ఈ గ్రంథాలలోని విద్యల, ప్రతీకోపాసనల పరిగణనలో, వాటి విషయవాక్యాల నిర్ణయంలో ఏకాభిప్రాయం కన్పించదు. ఇటీవలికాలంలో వాచస్పతి పండితరత్న, ఉ.వే.శ్రీమాన్ డా॥ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు భక్తినివేదన మాసపత్రికలో పలు బ్రహ్మవిద్యల వివరాన్ని తమదైన శైలిలో అందించారు. ఈ గ్రంథాలలోని విషయాలు యథావకాశం కృతజ్ఞతాపూర్వకంగా గ్రహింపబడ్డాయి.

ఈ బ్రహ్మవిద్యలను పూర్ణంగా వివరించడానికి నిశితబుద్ధి, విశేషవేదాంతపరిజ్ఞానం, అనుభవం కావాలి. వాస్తవానికి దాసునకు ఇవి ఏవీ లేవు. అన్నిటినీ వివరించాలంటే గ్రంథంకూడా చాలా పెరిగే ప్రమాదం ఉన్నది. అందువల్ల కొన్ని ప్రధానమైన పరవిద్యలు మాత్రం ప్రకృతంలో విన్నవింపబడ్డాయి. విద్యలకు సంబంధించిన సామాన్యాంశాలుమాత్రం అన్నీ ఇంచుమించుగా ప్రారంభంలో సూచింపబడ్డాయి. ఈ వ్యాసాన్ని విన్నపించమని నన్ను వాత్సల్యంతో ఆదేశించిన జ్ఞానవయోవృద్ధులు ఉ.వే శ్రీమాన్ ప్రొ. కోవెల సుప్రసన్నాచార్యస్వామివారి సన్నిధిలో, ఉ.వే. శ్రీమాన్ కోవెల శేషాచార్యస్వామివారి సన్నిధిలో, మిత్రమణి, వర్ధిష్ణువు ఉ.వే. శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామివారి సన్నిధిలో సవినయంగా తమ కృతజ్ఞతావిష్కరణను చేసికొంటున్నాను సుప్రసిద్ధవిద్వాంసులు, తమ పితామహచరణులు, కీర్తిమూర్తులు, **పండితరత్న, సుబోధక సుధీమణి, ఉపన్యాసకేసరి,** ఉ.వే. శ్రీమాన్ **కోవెల రంగాచార్యస్వామి** వారి దివ్యస్మృతి చిహ్నంగా ప్రతిసంవత్సరం తాము జరిపే పవిత్ర కార్యక్రమంలో భాగం అయిన ఈ ఏటి

ఉత్సవంలో అన్వయించి, కృతార్థుణ్ణి కావలసినదిగా ఆహ్వానించిన వీరి సౌజన్యానికి హార్దంగా అంజలి ఘటిస్తున్నాను. ఇందులోని గుణాలను ఆచార్యకృపాఫలాలుగా, దోషాలను అన్నిటినీ దాసుని అజ్ఞానప్రమాదకృతాలుగా గ్రహించి అనుగ్రహించవలసినదిగా సహృదయులైన పెద్దలను, విద్వాంసులను, పాఠకులను వేడుతున్నాను.

అనుల్లంఘ్యా గురో రాజ్ఞా కర్తవ్యేతి ధియా మయా ।
అవిచార్య మదజ్ఞానం విషయే లోభతోఽపిచ ॥

సహసా లిఖితం సర్వం క్షమ్యతాం వత్సలైః బుధైః ।
హంసక్షీరనయేనాత్ర ద్రష్టవ్య మితి చార్థయే ॥

ప్రథితో యో బిరుదేనోపన్యాసకకేసరీతి సార్థేన ।
కాశ్యపరంగార్యోఽసౌ సుబోధకసుధీమణి శ్చిరం జయతు ॥

ఉభయవేదాంతాలలో బ్రహ్మవిద్యలు